అరవింద

నవల

రచన

చిలకమర్తి సీతాంబ

నెల్లూరు

1935

# పీఠిక

...వతి ...వ్యాసంగ్రహ నవలను రచించిన శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు ...జౌతులకి నవీనులుగారు. ఈయమ రచించిన పద్మినీపరిణయమను ...లీమిశ్రీర ప్రబంధమును సముద్రమథనమను నాటకమును బండితులచేతను యంత్రికలలోనను విశేషముగ శ్లాఘింపబడియున్నవి. ఇవిగాక ఈమె అప్పుడప్పుడు అందందు వ్రాయుచుండిన పద్యముల గొన్నిటి "కాగాచిత్ర-పద్యరత్నము"లను పేర భాషాభిమానులు ప్రకటింపించియున్నారు. మరియు రఘువంశాంతర్గతమగు దిలీపచక్రవర్తి చరిత్రములోని సింహనందినీ సంవాద ప్రసక్తమగు కథాభాగమును నీమె బహు మనోజ్ఞమగు నేకాంకనాటకముగ రచించినది. అదియు అచ్చుపడియున్నది.

ఇవిగాక ఈమె వ్రాసిన మరికొన్ని పద్యములును వచనవ్యాసములును భారతిలోనను, గృహలక్ష్మిలోనను నెల్లూరులో ప్రచురింపబడుచుండు సుబోధిని, స్వతంత్ర లోనగు పత్రికలలోనను ప్రకటింపబడియున్నవి. పద్యమైననేమి గద్యమైననేమి ఈమెకు వాచావిధేయమైయుండును. ఈమె రచన సామాన్యముగ మృదుమధుర సులభశైలిలో నుండును ఇదానీంతన కవితా ప్రపంచమున నీమె కున్నతస్థాన మర్పింపదగును.

ప్రస్తుతమున అరవిందయను నీచిన్నవలయందు చరిత్రాంశములు కొన్ని, కథారామణీయకముపొంటె కల్పితాంశములుకొన్ని కూర్పబడి యున్నవి. సామాన్యముగ నీమె రచనలందు స్త్రీజనప్రాముఖ్యత స్ఫురించుచున్నది. పద్మినీ పరిణయమున ముఖ్యపాత్రములు పద్మినియు ఆమె చెలికత్తెల కళావతియు. సముద్రమథనమున మోహినియని చెప్పనక్కర తెలియగలరు. ఈ "అరవింద"యందు ముఖ్యపాత్రములు అరవింద

యు, వాసంతికయు, అరవిందా వాసంతికల ధైర్యప్రాగల్భ్యములు, క్లిష్ట సన్నివేశ సమీకరణములు, సాహసౌదార్యములు వర్ణనాతీతములు. ఈయిద్దరి కినయగు విజయసింహాశోకులుగలరు గాని ఈయిద్దరుస్త్రీలనుభవించిన యిడుమలు, వా రతిచాతుర్యమున నిర్వహించిన దుస్సాధ్యములగు కార్యములు బీభత్స రౌద్రకరుణారసముల నావహింపజేయగలవు. తమవారిపై దాడివెడలిన శత్రువులనోడించియు తమకు కీడుచేయనెంచిన దుర్జనుల గర్వభంగముజేసియు, జేయించియు ఈయిద్దరు యువిదలును కృతకృత్యురాండ్రయిరి. అరవిందవిజయసింహుని వాసంతికయశోకుని పెండ్లియాడుటతో కథ సుఖాంతముగను హృద్యముగను సమాప్తమైనది.

ఆధునికు లెవరైన నొక గ్రంథము వ్రాయబూనిన అన్యస్పృష్టములగు కథాభాగములు పదరచనలు లేకపోవుట సాధారణము. వాల్మీకిరామాయణమున భారతశ్లోకములు గలవు. శాకుంతలములోని శ్లోకముల నన్నిటను ముల సరిపోవు శ్లోకములు భాసునినాటకముల నున్నటుల యొకరు చూపియున్నారు. అటులనే ఈసీతాంబగారి రచననుపోలిన కథాంశములితరగ్రంథములనున్న నుండును. అంతమాత్రమున నీరచనకు స్వీయత తగ్గిపోజాలదు. వాసంతికవంటి పిచ్చిదియు, అశోకునివంటి ఇంద్రజాలికుడును గ్రంథాంతరముల జూపట్టినను ఆయాకవికి ఆయాసందర్భముల కెట్టి యూహాలె యిట్టికల్పనలె అంతికముగ స్ఫురింపగలవు. ఆద్యంతమును నీయరవిందశైలి బహు మనోజ్ఞముగను పాఠకాకర్షకముగను నున్నది. ఘట్టమునకు దగినపదముల గూర్చుటయందీమెశక్తి యమేయము. ఇది మన యాంధ్రభాషకొక చిన్న నూత్నభూషణముగ గ్రహింపదగియున్నది.

ఈకవయిత్రి నెల్లూరుమండలములో కలికివాయిగ్రామమున 1900

ఈమెకు చిన్నతనమునుండి విద్యాభిలాష అధికముగనుండినది. చిన్నతనమునసుండియు కవిత్వశక్తియు నంకురించియుండినది. ఈమెలో ఈరెండు సహజసంపదలును ప్రవర్ధమానములయి, ఈమె గృహిణీధర్మమున సంతానవతి యైనటుల వైదుష్యధర్మమునను శాశ్వతకీర్తిప్రదములగు సత్కావ్యసంతానముచే వర్ధిల్లినది. స్త్రీల యభివృద్ధివిషయమై ఈమెకు గల ఔత్సుక్యమును ఆసక్తియు గణనాతీతములు. వేయేల? తగినవిద్యాసంపద లేమిస్త్రీలు పురుషులకు వెనుజిక్కియున్నారను భావము ఈమె రచనల యందు స్పష్టముగ గనుపరచియున్నది. ఈమెకసామాన్యమగు నాంధ్రాభిమానముగలదు. మాతృభాష తెలుగగుటయే యిందుకు ముఖ్యకారణమనదగును.

ఈతరుణీమణి రచనలు స్త్రీజన సామాన్యమునకును తత్రాపి ఆంధ్రస్త్రైణమున ప్రాముఖ్యములుగను ఉద్బోధకములుగను ఉత్సాహజనకములుగను విద్యాసంపాదనసంరంభదాయకములుగను వెలయగలవు. ఈసాధ్వి దీర్ఘసుమంగలియై చిరాయురారోగ్యముల బెంపొందుచు ఇతోధికమునను నట్టియు విషయాంతర ప్రబోధకములగునట్టియు గ్రంథరాజముల విస్తరింప జేయుగాక.

ఇట్లు,

భాషాసేవకుడు

కె. యస్. కేసరి.

# మనవి

అరవిందయను నీ నవలను నే రచియించి చాల కాలమైయుండియు పెక్కుకారణములచే నది అముద్రితమై యొకమూలవడియుండినది. ఉదారులును స్త్రీవిద్యావిధానాభిలాషులును పూజ్యులును నగు శ్రీ కేసరి మహాశయు లీ గ్రంథమును సాదరమున నచ్చొత్తించి నా రచనల కృతార్థతనొందించినందులకు వారికి నా కృతజ్ఞతావందనములు.

నెల్లూరు.
ఫిబ్రవరి 1935

ఇట్లు
చిల్కపాటి సీతాంబ.

# అరవింద

## మొదటి ప్రకరణము

### వేఁట ప్రథమ సందర్శనము

అది వసంతకాలము. వృక్షములన్నియు మనోహరంబులగు కిసలయవిసరంబులఁ దొడఁగి చూచువారలకు కన్నుల పండువు సేయుచుండెను. మల్లికా మాధవీ లతాదులు నూతన కోరకంబులఁ దొడఁగి సౌరభంబుల వారల ఘ్రాణేంద్రియంబులకు స్వాగత మొసంగుచుండెను. అపుడే వికసించిన కుసుమములందలి కమ్మతేనియలం గ్రోలి తుమ్మెదలు ఝుమ్ముఝుమ్మని మ్రోయుచు ఒక పూవునుండి మఱియొక పూవునకు బరువులెత్తుచుండెను. కొన్ని తరువులనుండి తమ పిల్లలకై పరిపక్వ ఫలంబులఁ గొని శుకశారికాది శకుంత సముదాయంబు లతిసంతసముతో కులాయంబులఁ గూర్చి యెగిరిపోవుచుండెను. లేమావిగున్నలపై నెక్కి తొగరు చిగురులను కడుపార మెక్కి కోయిలదంపతులు కుహూకుహూమని సవిలాసముగ ముచ్చటించుకొనుచుండెను. నేలయంతయు పచ్చని పచ్చికలచేఁ గప్పబడి వసంతుని రాకఁ దెలిసి యాతని యడుగులకు మడుఁగు

లో త్త పట్టుతివాసులఁ బఱపించినదో యనునట్లుండెను. అపుడపుడు చల్లని పిల్లవాయువు లల్లనల్లన వీచుచు సమస్త జంతుకోటికిని సౌఖ్య మాపాదించుచుండెను.

అట్టికాలమున నొకనాఁటి యుదయమున వర్థమానపుర ప్రాంత వనమున నొక యాశ్వికవీరుఁ డొక యడవిపందిని దఱుముకొనుచు మిక్కిలి యుత్సాహముతో వచ్చుచుండెను. అతనివయ సించుమిం చిరువదిరెండు సంవత్సరంబు లుండ వచ్చును. ఆ యువకుఁడు ధరించిన తెల్లని పట్టుశిరోవేష్టనము బంగారుచాయగల మఖమల్పట్టుచొక్కాయయు నడుమున కతిబలముగా బిగించియుండు పటకానుండి పిక్కల వఱకు వ్రేలాడు పెద్దపిడిగల బాకును మఱియు నాతఁడు ధరించిన విలువలేని సరిగంచుదోవతియు పాదముల కతిసుందరముగా తయారుచేయఁబడిన ముచ్చెలును జూడ నాతఁ డొక యుత్తమ రాజపుత్రవీరుఁడని చెప్పక చెప్పుచుండెను. అతని విశాల సుందరవదనమండలమును, ఆకర్ణాంతనేత్రములును, మనోజ్ఞదీర్ఘనాసికయు, విశాలవక్షంబును, ఆజానులంబిత బాహుయుగళంబును, మిగుల పొట్టియుఁ బొడవునుగాని చామనచాయఁ గలిగిన మహోన్నత బలిష్ఠశరీరంబును జూడ నా మహాపురుషుఁడు ధీరోదాత్తుఁడనియు, వీరాధివీరుఁడనియు, ఆశ్రితావనుండనియు శత్రుభీకరుండనియు దోఁచుచుండెను. ఆ రాజపుత్రుఁ డా భూదారమును చంపు నుత్సాహముతో దానిం దఱుముకొనుచు రయంబున వెన్నంటి వచ్చుచుండెను. అపు డా వరాహము ప్రాణభీతిచే ముందునకుఁ బరువెత్తిపోవు

చుండెను. రాజకుమారుఁ డా పందిపై తన కరవాలమును గుఱిపెట్టి బలముగా నొక్కవిసరు విసరెను. అపుడా వరాహము ప్రాణములతోఁబాటు భయమును, ఉత్సాహమును వదలి ధరాతలమునఁ బడిపోయెను. అంత నా వీరుఁడు గుఱ్ఱమునుండి దిగి, వరాహశరీరమున నాటియున్న తన కరవాలము నూడబెఱికికొనుటకై యావైపునకుఁ బోవుచుండెను. ఇంతలో నెటునుండియో నలువురు రాక్షసవీరులు కృపాణపాణులై యాకస్మికముగా నతనిం జుట్టుముట్టిరి. మన వీరుఁ డా యోధులంజూచి ధైర్యముగా నీవిధమున బ్రశ్నించెను.

ఓయీ! మీరెవ్వరు. న న్నేకారణమున నీవిధముగాఁ జుట్టుముట్టితిరి?

మొద:—ఓయీ? మేము నీపాలిటి కాలుని దూతలము. నిన్నిపుడే యమసదనమున కతిథినిజేసి మా ప్రభు నానతిని నెఱవేర్చెదము.

వీరునకు పట్టరాని కోపము వచ్చెను. అతని కన్నులెఱ్ఱనై అగ్నిస్ఫులింగముల వర్షింపసాగెను. ఒక్కపెట్టున నా నలువురికి బుద్ధి చెప్పుటకై తన ముష్టిప్రహారములఁ జవిజూప నెంచెనుగాని మరల "వీ రెవ్వరో పరిపంథిరాజుల పనుపున నన్ను బట్టవచ్చినవారుగానున్నారు. గాన ముందుగా నీ యల్పుల నేమియు సేయరాదు" అని తలంచి వారింగాంచి:

"ఓయీ, ఐన నన్నిప్పు డేమి సేయదలంచితిరి" అని యడిగెను.

మొద:—"ఓరీ, మేము చేయఁబోవునది నీ వెఱుంగవా? ఇదిగో చెప్పెదఁజూడుము" అని తన వింటినారి సంధించి వాఁడి యగునలుగుల నాతనిపైఁ బఱుపసాగెను. వీరుఁ డా యమ్ములఁ దప్పించుకొనుచు తనయొద్దనుండు కరవాలంబును చటాలున నూడఁబెఱికి గిరగిరఁ ద్రిప్పుచు నా యోధుల సమీపించి యందొక్కరుని హయంబు ముంగాళ్లకు గుఱివెట్టి యొక్క దెబ్బకొట్టెను. ఆ దెబ్బతో నా సైంధవము నేలఁ బడియెను. తోడనే తక్కుంగల యోధు లాగ్రహావేశులై యా వీరునిపై శరవర్షముఁ గురిపింప నారంభించిరి. పాపము! ఆసమయమున వీరునకు దన యశ్వ మధిరోహించి వారితో యుద్ధమొనర్ప నవకాశము చిక్కకుండెను. ఐనను, సమరరంగమున మన వీరుని యభినవసవ్యసాచి యని చెప్పవచ్చును. ఆవిధముగా తన్ను జుట్టుకొని శరంబుల ముంచువారి నించుకయు లక్ష్యముసేయక తన కత్తిఁద్రిప్పు కౌశలముచే వారిలో నొక్కని శిరంబు నెగురఁగొట్టెను. అదిజూచి తక్కిన యోధులు దమ ప్రాణంబుల కాశింపక పోరసాగిరి. వీరుఁడు చాలసేపటినుండి వేఁటాడి డస్సియుండెను. తన పరిజను లే కారణంబుననో దూరముగానుండిరి. తా నెంతటి బలవంతుఁడైనను ఒక్కరుఁడు పలువురితో యుద్ధమొనర్చుట సామాన్యమా? అట్లని మన వీరుఁ డధైర్యమొందలేదు. ఆవిధముగాఁ దన కరవాలంబు ద్రిప్పుచు వారి శరాఘాతంబులఁ దప్పించుకొనుచు నా దురాత్ములమట్టుబెట్టఁ జూచుచుండెను. ధైర్యోత్సాహము లేవీరుని మనమున నతిశయిల్లియుండునో అట్టి

వానికి దైవము దోడ్పడుచునేయుండును. మన వీరుఁడించు కయు వెనుదీయక నా యోధులతోఁ బోరు సల్పుచునేయుం డెను. అప్పు డా దురాత్ములలో నొక్కరుండు పెద్ద యెలుం గెత్తి "యోధులారా? వీఁ డొక్కరుండైనను, యుద్ధమందుఁ బలువుర నొప్పించుచున్నాఁడు. ఇఁక వీనిని ప్రాణములతోఁ బట్టుకొనిపోయి మన ప్రభున కర్పించుట యసాధ్యము. గాన నిపు డతిబలము మెఱయ వీనింబట్టి వధింతము" అని హెచ్చ రించెను.

వీరుఁ డామాటల కించుకయైనఁ జంకుగొనక "ఓరీ! తుచ్ఛులారా? ఇప్పుడే మిమ్మందఱ నీ ధరాతలంబునకు బలి యిడి పాపవర్తనుండగు మీ ప్రభువునకు బుద్ధి వచ్చునట్లు లొనర్చెదఁ జూడుఁడు" అని యొక్క మెఱుపు మెఱసినంతలో నందొకని యశ్వంబుపై కుఱికి వానిచేనున్న కరవాలం బూడ బెఱికికొని, "ఇదిగో! పొమ్ము. నీ ప్రభుండగు యముని యొద్దకు" అనుచు నా యసితో వాని శిరంబు ఖండించెను. అపు డాఁవీరుని దారుణరణసంరంభము చూచి తమ్మందఱిఁ గూడ నీ సమరమునఁ బ్రాణములతో నిలువనీయఁడని తెంపు వహించి అందఱు నొక్కసారి యాతనిపై దారుణశరవర్షంబు గురిపింపసాగిరి. ఇంతలో నెచ్చటినుండియో యిర్వు రాయుధ పాణులగు నాశ్వికులు శరవేగమున వచ్చి మన వీరున కిరువం కల నిలచి యాతని ప్రతిపక్షులపై దారుణంబులగు తమ శరం బుల గురిపింపసాగిరి. అందొకఁడు పదునెనిమిది వత్సరముల కుమారుఁడు. రెండవవాఁడు పదునె దేండ్ల బాలుఁడు. కుమా

రుఁడు ఎదుటఁబడినవారినెల్ల తన తీక్ష్ణకరవాలంబున కెరఁ జేయుచుండెను. బాలుఁడు మన వీరునిదండ నిలిచి, యాతనిపై గురిపించు శత్రువులశరపరంపరలఁ దుత్తునియలు సేయుచుండెను. ఎంత కష్టమున కోర్చియైనను వీరుని వధించి తమ ప్రభుభక్తి వెల్లడింపవలయునని వారిలో నొక్కరుఁడు మన వీరుఁడు మెదుటఁ గొందఱితోఁ బోరుచుండ వెనుకపాటున వచ్చి వీరుని శిరంబు తెగనఱక కత్తినెత్తెను. తోడనే బాలుఁడు తన గుఱ్ఱము నతిలాఘవమున నాతనియొద్దకుఁ బోనిచ్చి వాని చేనున్న కత్తిని లాగికొనెను. ఇంతలో వీని మిత్రుఁ డతి వేగమున బరతెంచి యా వీరునిఁ జంపవచ్చిన దురాత్ముని శిరంబు ఖండించెను. అంతకుముందే యా యేకవీరుని సంరంభమున కోర్వజాలకయున్న యా యోధుల కా నూతన రాజపుత్రుల రాకయు వారి పరాక్రమమును జూడ భయ మధికమయ్యెను. చావగా మిగిలినవారిఁక తామిట నిలిచిన ప్రాణములు దక్కవని తలంచి తమ చేతిలోని యాయుధముఁ లటవిడిచి వింటినుండి విడివడిన యమ్ములవలె నొకక్షణములోఁ బలాయితులైరి. రణము చల్లారినది. వీరుఁ డావచ్చిన నూతనపురుషుల నాశ్చర్యస్నేహప్రేమపూర్వకదృష్టులఁ జూచెను. మిత్రుఁ డతివినయము దోప వీరునిగని నమస్కరించెను. బాలుఁడును నమస్కరించి కించి ల్లజ్జావనతవదనుఁడై యించుక దూరమున నిలిచి వీరునిపై ప్రేమయుతములగు దృష్టుల బఱపించుచుండెను.

వీరు:—"రాజపుత్రులారా! ఏకాకినై పరిపంథియోధు

లచేఁ బట్టుబడనున్న నన్నుఁ కారణవాత్సల్యమునవచ్చి సాయ మొనర్చి రక్షించిన మీకు, మే మెంతయు కృతజ్ఞులము." అని వారలఁ బ్రశంసించెను.

మిత్రు:—"మహాభాగా? మీవంటి మహానుభావుల రక్షింప నాలోకరక్షకుండగు శ్రీపతి కంకణము గట్టుకొని యుండుగాఁడె. అది యట్లుండ, వీరాధివీరులగు మీకు మేము సాయమొనర్చితిమని తలంచుట, తనచేతి దివ్వెవలన సూర్యు నకు వెలుఁగు గల్గినదని తలంచుటయే." యని సవినయ ముగఁ బలికెను.

వీరు:—"ఇటువంటి యుత్తమ రాజపుత్రులు తమ బలమును, మాటుపఱచుకొనుట స్వభావము. అయినను ఆ దీనవత్సలుఁడగు దైవమే మీ యిరువురరూపముగావచ్చి మమ్ము గాపాడెనని తలంచుచున్నాము."

మిత్రు:—'మహానుభావుల తలంపు లటులేయుండును.'

వీరు:—"మిత్రులారా, మ మ్మకారణముగా రక్షించి పున్నెము గట్టుకొనిన వీరపుంగవులరగు మీ నామధేయము లెవ్వియో యెఱుంగ వేడుకఁగొనుచున్నవాడ."

మిత్రు:—"వీరవరా, మేము, వర్ధమానపుర రాజకుటుం బములోని వారము. ఈ బాలుఁ డా పురమేలు సుదర్శనుని కుమారుఁడు. వీనిపేరు, అరవిందకుమారుడు. నే నీతని మిత్రుఁ డను. నాపేరు వసంతుఁడు.

వీరుఁ డించుక యోజించి బాలునివైపు దృష్టిసారించి

"అయ్యా! ఆ రాజున కశోకుఁడను కుమారుఁడును అరవిందయను మిక్కిలి చక్కని కుమారితయుఁ గలరని విందుమే" యనెను.

బాలుఁడు మిత్రునివెనుక కేగెను. మిత్రుఁ డించుక యోజించెను. మనవీరుఁ డా సుందరాంగుల మోములందు దన దృష్టినిల్పి వారు గమనింపకుండులాగున వారి యాకారములను జక్కఁగా పరిశీలించెను. ఆ రాకుమారుల మోములు శాంత భావముల కునికి పట్టులై సుందరములై యుండెను. వారి దేహములు గూడ కవచోష్ణీషంబులచే నాచ్ఛాదింపఁబడి యున్నను గడుసుకుమారములై సువర్ణచ్ఛాయలచే నలరారుచు కుసుమకోమలములై యున్నటులు తోఁచుచుండెను. భాషణ ములుగూడ నటులె మృదుమధుర గంభీరభావ విలసనములై యున్నవి. మనవీరుఁడు మిత్రునివంకఁ జూచినపుడు బాలుఁ డా వీరునిపై ప్రేమయుతములగు క్రీగంటిజూపులను బఱపుచుం డెను. వీరుడు బాలునివైపుజూచిన బాలుఁడు తనచూడ్కులు వేఱొకవైపుకుఁ ద్రిప్పుచుండెను. కుశాగ్రబుద్ధియగు మన వీరుఁ డా బాలకునివైఖరుల దిలకించి యించుక యోజించి మిత్రునింగని యీవిధముగా సంభాషించెను.

"మాకును, వర్ధమానపుర రాజులకును, కొన్ని కారణ ములచే కొంతకాలమునుండియుఁ బరిచయమించుక తగ్గినది. ఆ కారణమున నచ్చటి విశేషము లెవ్వియు మా కంత యథార్థ ములుగాఁ దెలియుట కక్కరగాని యవకాశముగాని లేదు. అందుచే నీ యరవిందకుమారుని, అరవిందకుమారియని విని

యుందుము. పొరబాటున మి మ్మిటులు ప్రశ్నించినందులకు, నన్ను మన్నింతురు గాక. అని సవిమర్శనముగా బాలుని మోముచూచుచు బల్కెను. బాలుఁడు తల వంచుకొనియెను.

మిత్రుఁడు చాల చురుకైన బుద్ధిగలవాఁడు. పరేంగితజ్ఞుఁడు. ఒకత్రుటిలో బాలుని భావమును గ్రహించెను. వీరునితో నీవిధముగా సంభాషించెను.

"రాకుమారా ? మీరు మమ్ముఁ బ్రశ్నించుటచే నేమియుఁ బొరపడినవారు కారని మా యభిప్రాయము. దాని కేమి: మీ రావినిన విషయమును, యథార్థమని తలంచి, యీ విధముగా నడిగియుందురు. ఇంతమాత్రమునకు మమ్ము క్షమా పణ వేడవలయునా? ఎన్నడు మీవంటి మహాపురుషుల సముఖ మున మెలంగనివాఁ డగుటచే మా యరవిందు డిప్పు డరవింద వలెనే ముగ్ధత్వమువహించి మీ సంభాషణలకుఁ దగురీతిని ప్రత్యుత్తరమొసంగఁ జాలకున్నాఁడు.

వీరు:—"దానికేమి మీ నెచ్చెలి కడుబాలుఁడైనను ఇంతకుముందు నన్నపాయముఁనుండి కాపాడుటకై శత్రువుల యెడఁ జూపిన పౌరుషమును, ధైర్యమును, రణకౌశలమును మిక్కిలి కొనియాడఁదగియున్నవి. ఇట్టి శూరవరునకు కలిగి నంత కాలము మనః ప్రియమొనర్చుచు ఎడబాయక, యీతనిఁ గలిసి, మెలగుచుండవలయునన్న కుతూహలంబు వొడముచున్నది." అని బాలునివైపు సాభిప్రాయముగఁ జూచెను. బాలుఁడు మిత్రునివైపుఁ జూచెను. మిత్రుఁడు వీరునితో "మహాభాగా ? పసిబాలురమగు మమ్ము గొప్పఁజేసి, మాయెఁడు స్నేహ

భావము గనుపఱచిన యుదారులగు మీనామమున నేయక్షర ములు పవిత్రములయ్యెనో యెఱుంగఁ గుతూహలపడుచున్న వారము."

వీరు:—"మిత్రులారా? మహాభాగ్యము. మాది కళ్యాణపురము. నే నాపురమేలు విక్రమసింహుని కుమారుఁడను. న న్నపాయమునుండి తొలిగించి యుద్ధరించినందులకు కృతజ్ఞతాపూర్వకంబుగా నొసంగు నా చిన్ని బహుమాన మంది, మీ రాకొమారుఁడు, న న్నానందింపఁ జేయుగాక." యని తన వ్రేలనుండి ఉంగరముఁదీసి బాలున కొసంగెను. బాలుఁడు కంపితహస్తములతో నా యుంగరముఁ గైకొని కనుల కద్దుకొనియెను. ఆ యుంగరమునపై 'విజయసింహ' అను నక్షరములు వజ్రములచేఁ జెక్కఁబడి కన్నులు మిరుమిట్లు గొలుపులాగున ప్రకాశించుచుండెను. దానింగాంచి మిత్రుఁ డిట్లనియెను.

"మహాభాగా! మీకీర్తి సకలదిక్కుల మాఱుమ్రోగు చుండ వినుచుండెడువారము. నేఁడు ప్రత్యక్షముగా మిమ్ము దర్శించి, మీ దయకు పాత్రులమై ధన్యులమైతిమి."

వీరు:—"సుహృన్మిత్రలాభముచే మేమును, మిక్కిలి వృద్ధినొందుచుంటిమి."

మిత్రు:—"మహాభాగా? పోయివత్తుము సెలవొసంగుఁడు."

వీరు:—"మంచిది." అని బాలునివైపుఁ జూచి ప్రేమతో

"నెచ్చెలీ పోయివచ్చెద. పెద్దవారి వైరములఁ బాటింపక మనము గలిసిమెలసి మైత్రిఁ బాటించుకొనున ట్లనుగ్రహింపుము."

బాలుడు మెల్లగాఁ? "మహాభాగ్యము."

అని యాతని వీడ్కొని యా రాజకుమారులు, వర్ధమానపురాభిముఖులై పోయిరి. వీరుఁ డేమేమో యోజించుకొనుచు, సశ్వారూఢుఁడై తన దారినేగెను.

# రెండవ ప్రకరణము

## భాగవత కథాకాలక్షేపము

వర్ధమానపురమునందలి రాజకన్యకాంతఃపురమున నిద్దఱు ముద్దియలు గూరుచుండి శ్రీమదాంధ్రమహాభాగవతమును జదువుకొనుచుండిరి. ఆ జగన్మోహనాకార లిరువురు సాన దీర్చిన సూనశరుని బాణములవలె, చూచువారి మనంబుల చూఱఁగొనుచుండిరి. వారి నీలాలకము లతిదీర్ఘములై వక్రములై తుమ్మెదగుంపులవలె సుందరములై యున్నవి. ఆ కాంతల నెమ్మొగంబులు, పరిపూర్ణ చంద్రబింబములం దులకించుచు మనోహరంబులగు చిరునవ్వు వెన్నెలలఁ బ్రసరింపఁజేయుచున్నవి. ఇరువురి భ్రూలతలును జగంబుల నొక్కుమ్మడి సాధింపనెత్తిన రతిమన్మథుల విండ్లవలె దీర్ఘములై యతివంపులై యున్నవి. మనోజ్ఞములగు, నాసికలు గూడ ఇరువురకు సంపంగిపువ్వులవలెనలరి ముక్తామణీవిభ్రాజమానములై ముద్దుల మూటగట్టుచున్నవి. వేయేల, ఇరువురు, పాటలాధరలే. ఇరువురిని కుందరదన లనందగును. శతపత్త్రేక్షణలని వినుతింప నిర్వురును తగినవారే. ఇరువురి కంఠములును కలకంఠములను తగవునకుఁ బిలుచుచున్నవి. అందులకుఁ దగినట్లు, వారి తనూలతలు గూడ బంగారపు శలాకలవలెనే యే యవయవము లెట్లుండవలయునో, య ట్లతిరమణీయములై యలరారుచు, బ్రహ్మదేవుని నిర్మాణనైపుణ్యమును చాటుచున్నవి. ఆ రెండు జగ

న్నోహన విగ్రహములను,ఒక్కయచ్చునసేపోసి, యొక్కతీరుననే దిద్ది, యొక్కచోటుననే నిల్పినటుల దోచుచున్నది. ఆ రాకు మరికలకు చెలు లంతకుముందె తలలుదువ్వి, వాలుజడలువేసి, మల్లెపూలచెండ్ల నా జడలపై పొందుపఱచిరి. వారు, పన్నీట జలకంబాడి, మేసతళ్లొత్తి యీ దినము శుక్రవారమగుటచే తెల్లని పట్టుచీరలంగట్టి యట్టి కంచుకములే దొడగి, వెలలేని వజ్రభూషణము లలంకరించుకొని, శ్రీమహాలక్ష్మినిం బూజించి, ముత్తైదులకు ఫలపుష్పతాంబూలాదు లొసంగి, వారి యాశీర్వాదములంది, భుజించి తాంబూలంబులంజేసి, ఏకతంబున తమమేడలోc గుర్చీలపైc గూరుచుండి, పుస్తకము చదువుకొనుచుండిరి. వారి యాకారములకును అలంకారములకును, ఇంచుకేనియు భేదములేదు. వారి స్వభావమునకును సత్ప్రవర్తనలకుc గూడ భగవంతుc డట్లె యభేదము సంకల్పించి యున్నాడు. వారింగూడ నొక్కతల్లి బిడ్డలని తలంపవచ్చును. అట్టి సోదరులకుc గూడ నిట్టి సౌహార్దముండుట యసంభవము. పూర్వజన్మ పుణ్యవశమున నితరులయందుc గూడ నిట్టి పవిత్ర ప్రేమ యుదయించునుగాని, వీరుమాత్ర మొకరికొకరు అన్యులని తలంపరాదు. ఇరువురును రాజకుటుంబములోనివారే. వీరొకతల్లిబిడ్డలైనను, లేకున్న, నన్నదమ్ముల పిల్లలైనను, మేనత్త మేనమామల సంతానమైనను గావలయును. వీరి వేషభాషలును, సౌందర్యగాంభీర్యములును జూడ నొకరికొకరు ప్రతిబింబములవలెc దోచుచుండిరి. కాని, యందొకతె పదునెనిమిదిసంవత్సరముల యువతి. రెండవయామె, పదునైదేండ్ల

బాలిక. కొంచమధిక వయసుండవచ్చును. బాలిక చదువు చున్నది. అందలి యర్థమును యువతి వివరించి చెప్పు చున్నది. ఇపు డా భాగవతమున శమంతకాపహరణమున సత్యాకృష్ణులవివాహము జరుగుచుండెను. సత్రాజిత్తు మణితోఁ గూడ కన్యకామణియగు సత్యభామ నొసంగి నిష్కారణముగా నీపై నీలాపనింద మోపిన నాతప్పు మన్నింపుమని వేఁడుకొనుట, కృష్ణభగవానుఁ డనుగ్రహించుట, సత్యభామ మనోరథ సిద్ధి నొంది, అనురూపవరుఁడగు నందనందనుని, చెట్టబట్టుట మొద లగు కథాభాగములు జరిగినవి. పుస్తకమును మూసి యొకచో నుంచిరి. బాలిక యేమియో యోచించుకొనుచు, ఎదుట చలువరాతి గోడలపైఁ జిత్రింపబడియుండు చిత్రములలో సత్యాకృష్ణుల విహారములం జూచుచు నొక్క నిట్టూర్పు విడిచెను. యువతి యామె భావమును గ్రహించి చిఱునవ్వున

"అరవిందా, తన కహితుఁడై సహింపరాని నింద తనపై మోపిన సత్రాజిత్తునకు మణిని వెదకి తెచ్చి యొసంగి మరల నాతని ప్రార్థనమున మణిని యాతని కూతును, బరిగ్రహించిన యా సత్యాలోలుని, దక్షిణనాయకత్వమును గూర్చి యోజించుచుంటివా?" యనెను.

అరవింద:—"వసంతా, తన తండ్రికిని శ్రీకృష్ణు నకును నెంత విరోధమున్నను, అట్టి విరోధమును పాటింపక శ్రీహరి తన్నుం జేపట్టి యెనలేని సౌఖ్యమొసంగ సఫలమనోరథ యగు సత్యభామ తపఃఫలమును గూర్చి యబ్బుర మందు చుంటిని.

వాసం:—ఇం దబ్బుర మేమున్నది? ఆ కృష్ణుడు దక్షిణ నాయకుఁడు గదా?

అర:—అవును? అయినను అరవరాని నింద తనపై బెట్టిన కుటిలాత్ముఁడగు సత్రాజితుపై ననుకంపగలిగి యాతని కాతుం జేపట్టుట ప్రశంసనీయము గదా!

వాసం:—అవు నాతఁడు దయాపరుండును రసికుఁడును గదా? అట్టివారు పూర్వవైరములను పాటింతురా. మొన్న వేట సమయమున నేకవీరుఁడగు నాతని కించుక సాయ మొనర్చుట యొక గొప్పఁజేసి మనము తన విరోధి కుటుంబములోనివారమని యెఱింగినవాఁడై కూడ ఆనాఁడు మనల నన్నివిధముల ప్రశంసించి, మనల నెల్లపుడు తనకు మిత్రులమైయుండునట్టులు ప్రార్థించుచు, తన కృతజ్ఞతం దెలుప సమాల్యమగు యంగుళీయకమును నీ కొసంగిన యా విజయసింహుని యౌదార్యమును ప్రత్యక్షముగాఁ జూడమా!

బాలిక మేను పులకించెను. వాసంతిక నవ్వుచు,

"రాజపుత్రీ! మీ తండ్రికిని యీ రాజులకును ఎంత వైరములున్నను నిన్ను సత్రాజిత్తు కృష్ణునకు సత్య నొసంగినటుల ని న్నా పురుషసింహున కొసంగిన మన రాజ్యమునకును, దేశమునకును భద్రమగునని తోఁచుచున్నది యనెను.

అరవింద సిగ్గుచేఁ దలవంచెను. తన వామకరాంగుళి యందు విలువలేని, వజ్రమణులచే 'విజయసింహ' యని చెక్కఁబడియుండు యుంగరముపై తన దృష్టిఁబఱపుచు మౌనమున నుండెను.

వాసం:—చెలీ! ఎంత గడుసుదానవే, హృదయగోప నము నీవలెఁ జేయువారి నెవ్వరిని జూడము.”

అరవింద వాసంతిక మోముఁజూచెను. ఆమె మోమున ప్రేమ గంభీరభావము లుట్టిపడుచుండెను.

అర:—సఖి నాకు నీయందు హృదయగోపన మే మున్నది. మాతండ్రి పట్టుదలయు, విరోధము సాధించుటయు, ఎఱుంగనిదానవా?! ఏదియో కారణములుజెప్పి, సభలలో కళ్యాణపురరాజుల నిందించుచుండును. నిష్కారణముగా, వారిపై పగఁబూనక సఖ్యమునను, బంధుభావమునను, మెలంగవలయునని హితోపదేశమొనర్చిన మా యన్నను తాను గన్న కుమారుఁడనిగూడ యోజింపక, కఠినముగా దేశ మునుండి వెడల నడపించెఁగదా?

అనునప్పటి కామెకు పట్టరాని దుఃఖమువచ్చి వెక్కి వెక్కియేడ్వ మొదలిడెను. వాసంతికయు తనకువచ్చు దుఃఖము నాపికొని అరవిందకుమారికన్నులఁ దనపైటకొంగునఁ దుడుచు చుండెను; కాని యామె కనులనుండిగూడ సంతాపాశ్రులు వెలువడి ముత్తెపుసరాలవలెఁ జాఱి యురోజములపైఁబడు చుండెను. కొంతసే పటులే యిరువురును మౌనమువహించి, యుండి, ఆవలవాసంతికధైర్యము దెచ్చుకొని.

“అరవిందా! ఊరకే అధైర్యపడిన లాభమేమి, మామ యేదో యొక విపరీతవేళా విశేషమునఁ గోపించి వెడలిపొమ్మ నిరి. మరల గొంతకాలమునకైన, తనకుమారునియెడ దయ గలిగి, పిలిపించుకొనడా.

అర:—చెలీ! అంతటి భాగ్యమా, నా ప్రియసోదరు నకు నీవర్ధాంగివై నీవర్ధమానపుర రాజ్యలక్ష్మివలె—మానగరున వసించి కనులార గాంచు భాగ్యము గల్గునా.

వాసంతిక సిగ్గునను విచారమునను దలవంచుకొనియెను.

అర:—సఖీ! ఈ కారణములవలన మనకుటుంబమున నేవియో మార్పులు గల్గునని తోచుచున్నది. తండ్రి మూర్ఖమువలన అన్న దేశాంతరముల పాలయ్యెను. పుత్రవియోగ దుఃఖమునకు అమ్మ ఆనాటికానాటికి కృశించిపోవుచున్నది. బలవంతులగు కళ్యాణపుర రాజులతోటి వైరము నానాటికి ప్రబలుచున్నది.

వాసంతిక ఇంచుక వికాసముతో

"చెలీ నీ కళ్యాణముతో, కళ్యాణపురరాజుల విరోధము దీఱును.

అర:—నీ కెప్పుడును పరిహాసములే గదే. నా కళ్యాణమునకును, కళ్యాణనగరరాజులకును, సంబంధ మేమున్నది?

వాస—ఉన్నదే—యది. విజయసింహునకిచ్చి వివాహ మొనర్చుటయే సంబంధము.

అర—మంచి తీర్పరివిగదే! అదెన్నటికి జరుగదు. జరుగుట కవకాశమును లేదు.

వాస:—చెలీ! అటుల విరక్తినొందుట లేల? నాం డరణ్యంబున నిన్ను ప్రశంసించుచు, న్నవు డాకుమారుఁడు నీ

యందు గనుబఱచిన ప్రేమయు, మనల వీడ్కొనునపుడు, నీపై బఱపిన సానురాగంబులగు చూడ్కులును మఱచితివా?

అర:—అగును. మనము రాజపుత్రుల మనియు, తన కుపకార మొనర్చినవార మనియు, అన్నివిధముల దన ప్రేమ గనుబఱచెను. దాని మఱియొకలాగు దలంచుట కాధార మేమున్నది?

వాసం:—చెలీ! ఎంత తెలియనిదానవే! ఆ రాజపుత్రుండు నిన్ను నిక్కముగా గురుతించలేదని తలంచితివా? తన్ను గాపాడినందులకు కృతజ్ఞతను జూపుచు, మనల వీడ్కొనునపుడు నాతో 'మీ నెచ్చెలికి మనఃప్రియము గూర్చుచు, కలకాలము వీనితోఁ గలసి మెలగుచుండఁ గుతూహలపడుచున్నాడ'నని సాభిప్రాయముగా బల్కుచు నీపై ప్రేమయుతములగు చూపుల బఱపుట యెఱుంగనేరవా?

అర:—ఔనే! నీ కన్నియు నట్టి విపరీతభావములే తోఁచుచుండును.

వాస:—నా భావములతో నేమి. మీ తండ్రి యీ సత్రాజిత్తువలె నిన్నాతని కొసంగునని చెప్పఁజాలనుగాని మీరు మాత్రము ఎటులైనను సత్యాకృష్ణులే యగుదురు.

వారిట్లు సంభాషించుచుండగా లోపలినుండి మెట్టెల చప్పుడయ్యెను. అందున వారి సంభాషణ మాగినది. అపుడరవిందతల్లి సుశీల, తన దాసిచే మల్లెపూలు నింపఁబడిన బంగరుపళ్లెర మెత్తించుకొని వచ్చుచుండెను. ఆమెను జూచి

ఆ కుమారిక లెదురేగిరి. అంత నామె దాసిచేతిపళ్లెర మట నుంచమని చెప్పి దానికి సెలవొసంగి పంపివైచి తానటనున్న రత్నకంబళముపై యాసీనయయ్యెను. అరవిందయు వాసంతికయు నామె కిరువైపుల గూర్చుండిరి. ఆ సాధ్విస్త్రీలకుఁ దగినంతటి యొడ్డుపొడవుగల్గి పచ్చని గేదంగిరేకువంటి దేహచ్ఛాయచే నలరి, పద్మినీజాతి స్త్రీల కుండదగిన అవయవ సౌష్టవ సౌకుమార్యములచే నలరారుచుండెను. కాని యామె యొడ లించుకపాలి కృశించి సహింపరాని సంతాపమునఁ గుందు చుండునటులఁ దోఁచుచుండెను. ఆమె చందనపుజాయ గల పట్టు జరీచీరయు నీలవర్ణముగల పట్టుంచురవికయు ధరించియుండెను. పుష్పములను భూషణములను మంగళార్థము కొలదిగా నలంకరించుకొనియుండెను. ఆమె మోమున దయాశాంత వినయ గంభీరభావములు తాండవమాడుచుండెను. ఆమె మాటి మాటికి విడుచు నిడుదయూర్పులఁజూడ నేదియో పెద్ద విచారముగూడ నామెను గుందించునటులుఁ దోఁచుచుండెను.

సుశీల:—అమ్మా వాసంతికా! నేఁడు శుక్రవార మగుటచే శ్రీ మహాలక్ష్మీ దేవ్యాలయమునకుఁబోయి మీ చేతితోఁ కట్టిన పుష్పహారముల నా దేవి కలంకరించవలయు నని చెప్పితిరి గదా! సాయంతన మగుచున్నది. మఱచి ముచ్చటలు జెప్పుకొనుచుంటిరా! అమ్మా, అరవిందా? అవిగో పూవులు. దండలు గ్రుచ్చుఁడు.

వాసంతికయు అరవిందయు దండలు గ్రుచ్చుచుండిరి. ఆమె మంచి పువ్వుల నేరి వారి కొసంగుచుండెను.

వాసం:—అత్తా, నేఁడు శ్రీమదాంధ్రభాగవతంబున శమంతకాపహరణముఁ జదువుచుంటిమి. అందుచే మీవద్దకు, వచ్చుట కాలస్యమైనది.

సుశీ:—భాగవతమును జదువుచుంటిరా? వసంతా, నన్నేల బిలువరైతిరి. పుణ్యకథాశ్రవణంబున నించుకప్రొద్దు గడపుకొందును గదా!

అర:—అమ్మా, తరువాతఁ జదివెదము లెమ్ము. విందువుగాని.

వాస:—అత్తా, సత్రాజిత్తు తానంత మూఢుఁడై నను వెనుక తెలివిదెచ్చుకొని సత్య గోరినటుల మణితోగూడ శ్రీకృష్ణున కామె నొసంగుట కొనియాడఁదగియున్నది.

అర:—అమ్మా, సత్యాదేవి తపఃఫలము వర్ణనీయము.

వాస:—అత్తా, ఒకవేళ సత్రాజిత్తు మూర్ఖుఁడై సత్యభామను కృష్ణున కొసంగ నిష్టపడనిచో నపు డా సత్య తన మనోహరుని బొందుట కేమి యొనర్పవలసియుండును.

సుశీ:—వెఱ్ఱితల్లీ! ఇవి యేమి ప్రశ్నలు? అతఁడు తన కన్నకూతునకు వ్యతిరేకముగ నడచుకొనునా?

వాస:—కాదత్తా. ఒకవేళ నట్లొనర్పనిచో సత్య యేమి చేయవలయును.

సుశీ:—ఎవ రేమి ఆటంకములు జేయబూనినను నవి పరకుగొనక తనమనఃకాంతుని పరిణయమాడ బూనవలయును.

అర:—అమ్మా, తండ్రికి వ్యతిరేకముగా నడువ వచ్చునా?

సుశీ:—దుర్మార్గవర్తనుఁడును తన కనిష్టముచేయువాఁ ఁడును తండ్రియైననేమి, మఱియెవ్వరైననేమి. తప్పక తన యాత్మబుద్ధియే మార్గముగాఁగొని సుఖింపవలయు.

వాస:—రుక్మిణిగూడ ఈ మార్గమే గదా యవలం బించినది.

సుశీ:—తరువాత సుభద్రయు బలరామునకు వ్యతిరేకముగ నర్జునుని వరించెను గదా!

అర:—అమ్మా, ఆధునిక రాజకుటుంబములలో నిట్టి వివాహములు జరిగియున్నవా?

సుశీ:—జరుగకేమి. మున్ను జయచంద్రుని కూతురు సంయుక్త పృథ్వీరాజును జేపట్టలేదా? సింహపురాధినేతయగు వీరవిక్రమసింహుని మూర్ఖుఁడగు తన తండ్రికి వ్యతిరేకముగా కళ్యాణి పరిణయమాడలేదా?

వా రిట్లు ముచ్చటించుకొనుచుండగా నొక దాసివచ్చి, "అమ్మా దీపములు వెలిఁగించిరి. దేవాలయమున కరుగుటకు పల్లకీలు సిద్ధముగా నున్నవని మనవి జేసెను.

పుష్పమాలలు గూర్చుట యయ్యెను. వారా పూలదండలను పూజాద్రవ్యములను బంగారపు పళ్లెరములలో నుంచి దాసీజనములతో పల్లకీలలోనుంప నాజ్ఞాపించిరి. మేలి ముసుగుల సవరించుకొని తాము పల్లకీలనెక్కి దేవాలయమునకుఁగూర్చి పయనమైరి.

ఆమె వర్ధమానపురమేలు సుదర్శనుని భార్య. ఆమె పేరు సుశీలయే. ఆ సాధ్వి సుదర్శనుని యిల్లాలని చెప్పుటకన్న నూరక సుశీలయని చెప్పుటయే యామెపేరునకు సార్థకముగా నుండును. ఆయరవింద సుదర్శనుని కూతురు. వాసంతిక యాతని మేనకోడలు. ఈమె తల్లిదండ్రులులేని బాలికయగుటచేఁ దన మేనమామయింట నరవిందతోఁ బెరుగుచుండెను. సహజసుశీలయగు సుశీల తనయాఁడుబిడ్డ పట్టిని తనకన్నబిడ్డకన్న నెక్కుడు ప్రేమమున బెంచుకొనుచుండెను.

# మూఁడవ ప్రకరణము

## రాజ్య పరిస్థితులు

కటకపురి మొదలుకొని యుదయగిరిపర్యంతము గల దేశమంతయు నుత్కల దేశపురాజులగు గజపతుల పరిపాలనమున కు లోఁబడియుండెను. క్రీస్తుశకము 1515-వ సంవత్సరమున శ్రీకృష్ణదేవమహారాయలు పూర్వదిగ్విజయమొనర్చి గజపతులను తనకు స్వాధీనులఁ జేసికొనిన యవ్వల మన యాంధ్రదేశమంతయు నెమ్మదివహించి యుండెను. అట్లని యందఱు సత్ప్రవర్తనులని తలంప నవకాశములేదు. అచ్చటచ్చట లోలోపల కుట్రలు, కుతంత్రములుచేయు దుర్గాధిపతు లుండిరి. ప్రతాపరుద్రుని వంశజుఁడగు నారాయణ గజపతి యా కాలమున కొండవీఁడు దుర్గాధిపతిగ నుండెను. అతఁడు చక్రవర్తి కుటుంబములోనివాఁడై యుండియు, తన యున్నతిం దలంపక సామాన్యులతో సహవాసము లొనర్చు స్వల్పబుద్ధి గలవాఁడు. తన సంపదలతో తృప్తినొందక యితర స్వల్పరాజ్యములఁ గబళింపఁ బ్రయత్నించు కుత్సితుఁడు. తాను గోరినయెడల నుత్తమరాజపుత్రికల నెందఱనేని పెండ్లాడఁదగు విభవముగలవాఁడై యుండియు, కంటికింపుగాఁ గనుబడిన వనితలనెల్ల వలఁచి వెతలొందుచుండు చపలుఁడు. వలయునేని యబలల బలాత్కారముగనైనఁ బట్టునంతటి క్రూరస్వభావముగల వాఁడు. వర్ధమాన పురరాజులకును కల్యాణపురాధీశులకును చాల తరముల నుండి సఖ్యమును సంబంధములును జరుగుచుండెను. సుదర్శ

నుఁడు చాల కుచ్ఛితస్వభావుఁడు. ఎవరేమిచెప్పిన నామాటలు వినువాఁడును యుక్తాయుక్తములరయు నేరని యవివేకియునై యుండెను.

సుదర్శనుఁడు పేరునకుమాత్రము వాసంతికకు మేనమామ. ఆ యనదబాలికకు తల్లియు, తండ్రియు, తక్కుఁగల బందుగులును పాప మా సుశీలయే. ఆ సుశీలకు తన బిడ్డలగు అశోకుని కన్నను అరవిందకన్నను వాసంతికయందే మిక్కిలి ప్రేమ. ఒక్కొకనేళ తన గారాముకోడలిని తనముద్దుకుమారునకుఁ బరిణయముచేసికొని వర్థమానపుర పట్టాభిషేక మొనర్చి కన్నులారఁ జూచి యానందించు భాగ్య మెపుడు గల్గునా యని యువ్విళ్లూరుచుండును. అట్టి యామె యాశయము నెఱింగి బందుగులును, భర్తయు, దాస దాసీ జనంబులును సంతసించుచుండెడివారు.

కొన్ని సంవత్సరములకు ముందు సుదర్శనుని రాజ్యమున అనావృష్టి దోషము సంభవించెను. చెఱువులు మొదలగు జలాశయములలోని నీరు ఇంకిపోయెను. పాడిపంటలు లేకుండుటచే సామాన్యజనులందఱు, అన్నపానములులేక మిక్కిలి కష్టపడుచుండిరి. ధనికులగువారు మాత్రము తమకున్న ద్రవ్యమును ధాన్యమును భద్రపఱచుకొని సంసారముల మితవ్యయములతో జరుపుకొనుచుండిరి. బీదసాద లెవ్వరైన వచ్చి పిడికెడన్నము పెట్టుడని కాని జేనెడు వస్త్రమిమ్మని కాని వాకిండ్ల ముందు నిలిచి దీనాతి దీనముగా వేడుకొనినచో, ఇండ్ల యజమానురాండ్రు కుర్చీలపైనుండి లేవకయే "పొందు తెల్లవాతి

నచో మీ కేమివనే బొట్టులేక వచ్చి గుమ్మములవద్ద నిలిచి పీడించెదరు. మీకు పెట్టలేక... మా... ప్రా[illegible]ములు విసికిపోవుచున్నవి. ఇఁక నిటులే మీకు బిచ్చములు వేయసాగిన మేము గూడ మీవలెనే జోలిఁగట్టుకొని బయలుఁదేఱవలసి వచ్చును. పొందు మీ రిచటఁబడి గింజుకొని చచ్చిననను బిచ్చమువేయ" మని కఠినముగాఁ బల్కుచు వారిం దఱుముచుండిరి.

ఇట్లుండగా దేశములో దొంగలరాయిడి యధిక మయ్యెను. అందుకుతో డచ్చటచ్చట అగ్ని భయములుగూడఁ గలిగి ప్రజల బాధించుచుండెను. ముందు బీదలకు బిచ్చములు వేయక మీకు బిచ్చమువేసిన మేముగూడ మీవలెనే బిచ్చము నకుఁ బోవలసివచ్చునని చెప్పిన భాగ్యవంతురాండ్ర మిద్దెటిండ్ల యందు చోరులు దొమ్మిగట్టి ప్రవేశించి వారికి బీదలకుఁ బెట్ట వలయునన్న శ్రమ గలుగకుండ వారిండ్లయందుఁగల ద్రవ్య ధాన్యములన్నియుఁ దస్కరించుకొని పోవసాగిరి.

దేశమంతయు విశూచి, స్ఫోటకము మొదలగు భయం కర వ్యాధులు బయలుదేఱి జనుల మారిమసంగివై చుచుండెను. ఇట్టి విషమస్థితిలో శిస్తు లియ్యమని రాజకీయోద్యోగులు ప్రజలను త్వరపెట్టన CHECKED-93 అన్నములేక మలమల మాడుచుండువా రేవిధముగా ద్రవ్యమార్జించి శిస్తులు చెల్లింపఁ గలరు? "అయ్యా! యీ యేడు వర్షములులేక పంటలు పోయినవిగదా? తినుట కన్నములేక నిత్యోపవాసములు సేయుచున్నాము. కుటుంబపోషణము జరుపుకొనఁజాలక యిడు ములుపడు మాయందు దయయుంచి యీ యేటి శిస్తులఁ

ద్రోసివేయుఁడు" అని రైతులందఱు బతిమాలుకొనిరి. వారి కష్టములఁజూచి సుదర్శనుని యుద్యోగులు జాలిఁగొని తమ ప్రభువువద్ద వారిస్థితిగతుల మనవిఁ జేసిరి. అవివేకియగు సుదర్శనుని కా మాటలు చెవికెక్కలేదు. పైపెచ్చు, రైతులు దుర్మార్గులై శిస్తులు చెల్లించుటమానిరనియు, తన క్రింది యుద్యోగులు వారికి సహాయులై తనకు నష్టము గల్గింపఁ జూనిరనియుఁ దలంచి వారినెల్ల నిందించెను. అంతటితో విడువక తన క్రింది మఱికొందఱుద్యోగుల రావించి రైతులకుఁగల స్థిరచరాస్తులన్నియు జప్తీలుచేసి వారిని బాధింపుఁడని యాజ్ఞాపించెను. ఆ యుద్యోగులు రాజాజ్ఞజరిపింప నారంభించిరి. అపుడు రైతులు తక్కుఁగల ప్రజలు మఱికొంద ఱుద్యోగుల నాశ్రయించి వీరిపైఁ దిఱుగుపాటొనర్చిరి. వారలు పశువుల విప్పబోవ రైతులు కఱ్ఱలుచేఁబూని వచ్చినవారిని గొట్టిపంపుచుండిరి. ఇండ్లలోనున్న వస్తువుల బైటవేయఁబోయిన వారి కచ్చట కాంతాకరవాలప్రహారము లమరుచుండెను. రాజోద్యోగుల నెవ్వరు లక్ష్యపెట్టుటలేదు. ఇదిచూచి యుద్యోగు లిఁక తమ యాటలు సాగవని రాజునకు రైతులు చేసిన తిరుగుఁబాటును మనవిజేసిరి. సుదర్శనుడు నిప్పుద్రొక్కిన క్రోఁతివలె రైతులను, ఉద్యోగులనుగూడ దిట్టనారంభించెను. ఉద్యోగుల కందఱికి రాజుపైఁ గోపము గల్గెను. అందఱుగలసి మాటలాడుకొని యొక్కసారి తమయుద్యోగములకు రాజీనామాల నిచ్చిరి. కఱ్ఱఁబట్టిన నౌకరు మొదలు, కలముఁబట్టిన యుద్యోగులవఱకు (నాన్‌కోఆపరేషన్) అసహాయోద్యమ కంకణముఁ

గట్టుకొనిరి. ఇపుడు సుదర్శనున కెవ్వరు సహాయులు లేరు. స్వామిభక్తిగల యొకరిద్దఱు నౌకరులు మాత్ర మాతనిఁ గొలిచియుండిరి.

సుదర్శను డపుడు తనకు శిస్తులు చెల్లించక ప్రజలు దిరుగుఁబా టొనర్చిరనియు తన యుద్యోగులుగూడ వారితోఁ గలసి కుట్రలుచేయుచున్నారనియు ఈ సమయమున మీసేనల నంపి యీ ప్రజల యల్లరులడంచి మాకు తగు సహాయ మొసర్పుడనియు కళ్యాణనగరాధీశుఁడగు విక్రమసింహునకు వర్తమానమంపెను. విక్రమసింహుఁడు చాలదూరాలోచనగల వాఁడు. ధర్మప్రభువు. బాగుగా యోచించనిదే యేకార్యము నను చొరఁడు. తన సమీపరాజ్యములలో నేవిగాని కుట్రలు మార్పులు గల్గినచో అపుడే గ్రహించి తన రాజ్యమును భద్ర పఱుచుకొని, యితరరాజున కించుకయైన చొరవనీయని సమర్థుఁడు. అతఁడు వర్థమానపున సమాచారములగూర్థ చారులవలన నెఱింగియే యుండెను. సుదర్శనుఁ డంపిన సందేశ మున కీ విధముగా ప్రత్యుత్తర మంపెను. "క్షామమువలన నన్నపానములులేక కష్టపడు ప్రజ లేవిధముగా పన్నులు చెల్లిం తురు? ఇపుడు నీవు వారిని శిస్తులిమ్మని బాధింపరాదు. మఱియు నీ బొక్కసమునను న్న ద్రవ్యమును, బీద సాదలకుఁ బంచిపెట్టి, వారల నీ కఱవునుండి గాపాడదగు బాధ్యత నీకు గలదు. అట్లొనర్పక వారిని బాధించితివేని, నీ పరిపాలనమున కపాయము రాగలదు. ఈ విషయమున మేముగాదుగదా! ధర్మప్రభువులగువా రెవ్వరు నీకు సహాయమొనర్పరు. ముందు

వెనుకల యోజించుకొని ప్రజలకు హితమొనర్చుచు నీ రాజ్యమును కాపాడుకొనుము.” విక్రమసింహుఁ డంపిన యీ ప్రత్యుత్తరమును విని, సుదర్శనున కేమియుఁ దోఁపక, అప్పటికి ప్రజల బాధించినచో తన కపాయము వచ్చుననియు, నితరరాజు లెవ్వరు తనకు సహాయము రారనియు, దెలిసికొని వారల నేమియుఁ ద్వరపెట్టక యూరకుండెను. ఐనను విక్రమసింహుని పై యసూయయు మితిలేని కోపమునుగలిగెను. దగ్గఱబంధువుఁడగు తనకు సహాయ మొనర్పక నిరాదరించిన యాతనిపైఁ దన పగ యేవిధముచేనైనను దీర్చుకొన బ్రయత్నించుచుండెను. అట్లు చేయుటకు కొందఱు రాజులను లోఁబఱచుకొనవలయును. ముందు తనప్రజలే తనకు విరోధులై యున్నారు. అభిమాన శూన్యుఁడగు నాతఁడు వారియెడ నంతలోనె బూటకపు టాదరములఁ జూపి, వారిని త్వరలో దనకు లోబఱచు కొనియెను. ఎంత లోఁబడినను, కొందఱు ప్రజల కీతనియెడ, నసహ్య ముండనే యుండినది.

మఱుసటి వత్సరము వర్షించినది. దేశము సుభిక్షముగా నుండినది. అదిమొదలు సుదర్శనుఁడు రహస్యసభల జరిపి, కళ్యాణ నగరాధీశుడగు విక్రమసింహునిపై పగఁ దీర్చుకొన నాలోచించుచుండెను. ఆ సభ్యులలోఁ గొందఱికి సుదర్శనుని యాలోచనలు బొత్తుగా రుచింపక, విక్రమసింహునితో విరోధము తగదనియు, అతఁడు మనకు హితుఁడనియు విశేషించి, వర్థమానపురరాజులగు మీకు బంధుగుఁడనియు, పరాక్రమ వంతుఁడనియు, ధర్మాత్ముఁడనియు, అట్టివానితో విరోధము

బెట్టుకొనుట మన రాజ్యమునకు శ్రేయస్కరము గాదనియుఁ జెప్పిరి. సుదర్శనున కాహితబోధలు రుచింపలేదు. ఎట్లైనను విక్రమసింహునిపై పగఁదీర్చుకొనక మాననని, పట్టుఁబట్టెను. విధిలేక కొందఱు ప్రజలు రాజు ననుసరించిరి. కొంద ఱుదాసీనులుగా నుండిరి. అదిమొదలు విక్రమసింహుని సాధింపఁ దగు ప్రయత్నములు జరుగుచుండెను. విక్రమసింహుని యొద్దనుండి యితరరాజులకు వచ్చుచుఁ బోవుచుండు నుత్తర ప్రత్యుత్తరముల నానాచోటుల కందకుండ నపహరించుకొని వచ్చుటకు ఆ రాజ్యముల సరిహద్దులయం దచ్చటచ్చట, కొందఱు గూఢ చారులను గాపుంచెను.

సుదర్శనుని కుమారుఁడగు నశోకునకు యుక్తవయసు వచ్చినది. చదువు సాములయందును, రాజనీతియందును, శస్త్రాస్త్రములయందు నాతఁడు అసాధారణ పాండిత్యము సంపాదించెను. తాను నేర్చిన విద్యలన్నిటిని, తన ముద్దుచెలి యలగు నరవిందకును, తన ప్రేమంపు మరదలగు వాసంతికకును, జక్కఁగా నేర్పెను. ఆతఁడు పరాక్రమమున కుమారుఁడనియు, బుద్ధికౌశలమున బృహస్పతియనియు, జెప్పవచ్చును. వానికి తన తండ్రి కళ్యాణపురాధీశుల విషయమునఁ జేయుచుచేష్టితము లేవియు, సరిపడుటలేదు. కాని తండ్రియెదుట నిలిచి యాతనికి వ్యతిరేకముగ మాటలాడినచో తన కుమారధర్మమునకును, తండ్రి పితృగౌరవమునకును, భంగము గల్గునని కొంతకాల మూరకుండెను. అంతకంతకు సుదర్శనుని కుతంత్రము లధికమగు చుండెను. ఇదిచూచి సహింపలేక అశోకుఁ డొకనాఁడు

తండ్రియొద్దకేగి సవినయముగా "నాయనా? మనకు కళ్యాణ పురపువారు పరమాప్తులును, దగ్గఱబంధుగులునుగదా! అది యునుగాక బలవంతులు. కారణములేకయే అట్టివారిపై పగం బూనుట మనకుభద్రముగాదు. ఇకనైనను ఈ విరోధములు మాని మరల నెప్పటివలెనే వారితోం గలిసియుండిన మనకు సుఖము గల్గును. విక్రమ సింహుండు చాలామంచివాండనియు, వీరాధివీరుండనియు, మనకు దగ్గఱ చుట్టమనియు విను చున్నాము. అట్టివానితో విరోధము బెట్టుకొనుట యెంతమా త్రమును శ్రేయస్కరముగాదు." అని హితోపదేశ మొన ర్చెను. కుమారునిమాటలకు సుదర్శనుని యొడలు మండి పోయెను. 'ఛీ మూఢుండా, నీవేమో పెద్దవాండవై నా రాజ్యము నుద్ధరింతువని దలంచితిని. ఇదియా నీతెలివి? ఆ పగవారేమో నీకు తగురీతిని ఎవరిచేతనో దుర్బోధలు జేయించు చున్నారు. ఇందుకు సందియములేదు. ఇంక నీ విటనున్నచో నాకును నారాజ్యమునకును ముప్పు దేగలవు. పొమ్ము నీ యిచ్చ వచ్చిన తావునకు!! నీ కన్ను బొడిచినట్లు నా యిచ్చవచ్చినవారికి రాజ్యం బొసంగెద పొమ్ము! ఇంక నీ మొగము జూడను. ఇది మొదలు నారాజ్యమున నడుగుబెట్టితివేని నీవు నా కొమరుండవు గావు. వెడలు"మని కఠినముగం బల్కెను. అందుల కశోకునకుం గోపమువచ్చి యింక మూర్ఖుడగు తండ్రిమొగముం జూడరాదని నిశ్చయించెను. ఒకసారి తండ్రికి నమస్కరించి, తల్లి మొదలగు వారికిం దెలియనీయకయే, తన యశ్వము నెక్కి కట్టుబట్టలతో అసిమాత్ర సహాయుడై యెచ్చటకో పోయెను. తనతప్పు తా

నెఱుంగనేరని సుదర్శనుఁడు తనకును తన కుమారునకును విరోధములు కల్పించి, కుమారుని తన నుండి వేఱుపఱచినవారు కళ్యాణపురరాజులని తలంచెను. ఇఁకఁ బ్రత్యక్షముగా వారిపై పగ సాధింప మొదలిడెను. కళ్యాణపుర రాజకీయోద్యోగులు గాని, యారాజకుటుంబమునకు జెందిన వా రెవరైనగాని, యొంటిపాటున దొఱకిన పట్టి బంధించి తన కొప్పగింపుఁడని కొందఱు భటుల కాజ్ఞాపించి యచ్చటచ్చట గాపుంచెను. మొదటిప్రకరణమున, కల్యాణపుర యువరాజగు విజయసింహుని యొంటిపాటున జుట్టు ముట్టి బంధింపఁబూనినవా రీ సుదర్శనునివారే.

# నాల్గవ ప్రకరణము

## తిరుపతియాత్ర

ఆశ్వయుజ శుద్ధపూర్ణిమ శ్రీ తిరుపతి శ్రీ వేంకటే శ్వరస్వామివారి కల్యాణోత్సవ మతివైభవముగా జరుగును. అందులకు భారతదేశీయులు వేనవేలుగా వత్తురు. అపుడు శ్రీవారికి బ్రహ్మోత్సవదినములు. సాధారణముగా వట్టిరోజుల యందే తిరుపతి కొండకువచ్చు పరిషజ్జనము అన్ని దివ్యదేశ ములకన్న నూరురెట్లధికము. ఇంక నీయుత్సవదినములలో లెక్కింపఁదరమా?! మ్రొక్కులు చెల్లించువారు, స్వామికి వేయ నొప్పుకొనిన కానుకలు మూటలుగట్టుకొని పసపుగుడ్డలతో దంపతులు కొంగుముళ్లువైచికొని భక్తిరసంబులు మోమున దాండవింప గోవిందలుపెట్టుచు కొండనెక్కుచుండిరి. మఱి కొందఱాడువారు పిల్లలనెత్తుకొని కొండనెక్కుచు నలసి పిల్లలను క్రిందదింపి "అబ్బా గూటములవలె చంకలలో గూరు చుండిన మిమ్ము మోయలేక మాపని యఁగుచున్నది—రండు కాస్తదూరము నడచి"యని వారిని చేతులుబట్టి తిన్నగా నడిపించుచు కొండనెక్కుచుండిరి. కొందఱు ముసలమ్మలు దమ కోడండ్రను కూతుండ్రను జూచి "పిల్లలారా, మీకు పిల్లలు గలుగుటకై యిచ్చట బ్రొయిలుబెట్టుదని వారిచే నట్లుజేయించి యాబ్రొయిలకు దండములుబెట్టించి "అమ్మా, మాపిల్లలకు ముందుకు పిల్లలు పుట్టినయెడల అచ్చటికివచ్చి యీబ్రొయి లను దింపించెదమని తెగువగల మ్రొక్కులు మ్రొక్కొనుచు

ముందునకుఁ బోవుచుండిరి. మఱికొందఱు పడుచులు దారి ప్రక్కల విశేషముగా తీగెలల్లియుండు చోటులకరిగి రెండు పొదలతీగెల నొకటిగాఁజేర్చి ముళ్లువైచి ముసిముసినవ్వులు నవ్వుచు నాతీగెలకు నమస్కరించి తమ పెద్దవారితోఁగూడ పర్వతారోహణ మొనర్చుచుండిరి.

కొందఱబలలు కొండ లెక్కలేక అలసి చెమటలు పోయుచుండఁ జదికిలఁబడి "అబ్బా! కాళ్లు నొప్పులెత్తుచున్నవి. ఇంకెంతదూరము కొండ నెక్కవలయు?" అని ప్రశ్నింప వారి మగవారు "ఇదేమొదటిది శ్రీశైలము దాఁటితిమి. అది యెక్కుటయేకష్టము. రెండవది శేషాచలము. అది దాఁటు చున్నాము. మూఁడవకొండ గరుడాద్రి దానినెక్కుట యొక కష్టముగాదు. ఇఁక నాల్గవది వేంకటాచలము. అచ్చట వేడుకగా డోగాడియైనను పోవచ్చును. ఐదవది నారాయణాద్రియు. ఆఱవది వృషభాద్రియు, నేడవదియగు శ్రీస్వామి వారి సమీపశైలములు నొక్కగడియలో వెనుకవేయగల"మని పల్కుచు నెమ్మదిగా వారిని దరలించుకొని పోవుచుండిరి. ధనికులగువారును ముసలివారును చంటిపిల్లల తల్లులును డోలీలపైఁగూరుచుండి పోవుచుండిరి. స్వామివారిని దర్శించి మ్రొక్కుఁబడులను జెల్లించుకొని నున్నగా భద్రవాకరణ ములచే నలంకృతమగు తలలతో చిక్కంట పుల్లనామములు పెట్టుకొని మెడలలో తులసిపూసలపేరులు వేసికొని ముతుక నూలుతో నేయఁబడిన నల్లకమ్మలపంచలు చెంగులువిడచి దోవతులుగట్టుకొని పడమటిదేశపు వర్తకులు కొండదిగి వచ్చు

చుండిరి. వారివెనుక వారిస్త్రీలు, తమ శిరోజములు స్వామి వారి కొసంగుటచే ముతుకకోకల పైటకొంగుల తలలపై యఱముసుగులువేసికొని సందెడేసి నల్లపూసల చేరులకు దోడుగా మఱిసందెడేసి తులసిపూసలపేరులు మెడలో వేసికొని యెడపిల్లలను చేతఁబట్టుకొని చంటిపిల్లల చంక బెట్టుకొని యెఱ్ఱపాగాఁగల రక్షకభటులుగాని, మఱియెవ్వరైన చొక్కాయి తలగుడ్డలుగల యుద్యోగులుగాని కనుపించిన భయముచే పదిబారలదూరము తొలగిపోవుచు యెవరైన నాగరికులు గనుపించిన నోళ్లుదెఱచుకొని వారివైపటులే చూచుచు దిగివచ్చుచుండిరి. దాసరులు నెమలికుంచెలు వీపులపై జీరాడ గరుడకంబములు చేతబట్టుకొని జాగంటలు మ్రోగించుచు "గోవిందా గోవిందా"యని యాత్రికుల మార్గమునకడ్డువచ్చి "అయ్యలారా? ధర్మములుచేసికొనుడు. అమ్మలారా మీబిడ్డలము. యాత్రకువచ్చి మాకు దానములు చేయుటయే పుణ్యము" అని తమ జేగంటలశబ్దములకు కొండ గుహలు మాఱుమ్రోగుచుండ కనుబడినవారినెల్ల యాచించుచుండిరి. ధనవంతులు మనీపర్సుల చొక్కాజేబులనుండితీసి యవి ద్రవ్యములచే నిండియుండుటచే యీజనసమ్మర్దమున మూతలుదీసిన నందలిపైక మెచ్చటనైన బడిపోవునని ధర్మము నేయకయే మరల వానిని భద్రముజేసికొనుచుండిరి. సామాన్యులుమాత్రము తమ బొడ్డుకొంగులనున్న కొలఁదిద్రవ్యములో నొకకానీ, దమ్మిడీ, కాసు, నీవిధముగాఁ దమపిల్లలచే ధర్మ

ములువేయించి వారిచే దీవనలంది యానందించుచుఁ బోవు చుండిరి. ఇక స్వామివారిని సేవింతము.

శ్రీ వేంకటేశ్వరస్వామి యాలయమున జనసమ్మర్దమున నిసుకవైచిన రాలుటలేదు. మొక్కుఁబడులవారు గుంపులు గుంపులుగావచ్చి గండదీపములు, పొరలుదండములు, ప్రాణా చారములు మొదలగు ప్రార్థనలఁ జెల్లించుచుండిరి. ధనికులగు వర్తకులు తూర్పుసీమరెడ్లు, జమీందారులు, మారువాడీ దేశీయులు మున్నగువారు లెక్కింపరానిద్రవ్యములను సంచులు సంచులుగా శ్రీవారి హుండీయందుఁ గుమ్మరించుచుండిరి. కొందఱు తమబిడ్డలకు తలనీలములొసంగి నామములుదీర్చి స్వామివద్దకుదెచ్చి కర్పూరహారతులిచ్చి "స్వామీ! వీరు మీబిడ్డలు. మీపేరున నూరుకాలములు వర్ధిల్లునట్లనుగ్ర హింపు"డని ప్రార్థించుచుండిరి. వేయేల యెటుపోయినను గోవిందలే యెచటఁజూచినను జనసమూహములే యెచ్చటను తెరిపిలేదు. ఇఁక గర్భాలయమున లోకేశ్వరుండగు శ్రీ వెంకటే శ్వరులు చతుర్భుజంబులతోడను శంఖచక్రంబులతోడను కోటి సూర్యప్రభాభాసమానమగు దివ్యమణికిరీటముతోడను ఘన సార కస్తూరిమిళిత దివ్యపరిమళ లసదూర్ధ్వపుండ్రంబులతోడను, శ్రీవత్సకౌస్తుభ వైజయంతీ వనమాలికా విశాలవక్షంబుతోడను, అఖిలచేతనోజ్జీవంబులగు అభయహస్తంబులతోడను అమూల్య ధౌతవసన పరిధానంబుతోడను, శ్రీ విరజావాహినీ సంగత పాద పంకేరుహంబులతోడను తన్నొకపరి దర్శించినవారి పాపంబుల భస్మీపటలంబులజేసి అవ్యయ సౌఖ్యపదవినొసంగి రక్షింప

ప్రసన్నవదనేందుమండలముతో వేంచేసియున్నారు. అర్చకులు సాక్షాత్పరమపదముననుండు ముక్తపురుషులవలె ద్వాదశోర్ధ్వ పుండ్రములధరించి పట్టంచుధోవతులు పట్కాచ్ఛముతోఁగట్టి శ్రీ స్వామివారియొద్దనిలిచి భక్తులొసంగు పండ్లు తాంబూలంబులు స్వామికి నివేదించి కర్పూరహారతినిచ్చి వారికిజూపుచు వారాహారతిని కన్నులనద్దుకొని తమకు దోచినకానుక లా పళ్లెరముననుంప నవి గ్రహించి వారికి శఠారియు తులసియు తీర్థములునొసంగి పంపుచుండిరి. నిదానముగా నాపాదమస్తకము స్వామివారిని సేవించుట కపుడెవ్వరికిని సాధ్యము గాదు. రూపాయి కానుకనిచ్చినగాని అట్లు సేవింపనీయరు. సామాన్యులది యొసంగలేక యొకసారివీక్షించి నమస్కరించిపోవుచుండిరి. రాత్రి పదిగంటలవఱ కీవిధముగా జరుగును. అవ్వల రాత్రి నైవేద్యములు నేకాంతసేవయు జరుగును. దేవాలయమున జనులెవ్వరునులేరు. స్వామివారి పరివారముమాత్రముండెను. అపుడు స్వామివారియొద్ద నిర్వురు రాకుమారికలు కొలఁది దాసీజనములతోనిలచి సేవించుచుండిరి. వారు గంపలకొలఁది ఫలములను పుష్పములను తాంబూలముతో దేవునకు సమర్పించి కర్పూరహారతి నిప్పించిరి. హారతియైనపిమ్మట నా పళ్లెరములో తామందఱును సువర్ణరూప్యములును వరహాలు మాడలును సమర్పించిరి. అర్చకులు గౌరవవినయములతో వారిం జూచి "స్వామివారి వక్షస్థలలక్ష్మి యిదిగో జూడుడు. అవిగో నాగాభరణములు. శ్రీ భగవద్రామానుజులు సమర్పించిన శంఖచక్రంబులు చక్కగా నీక్షింపుఁడు. పాదములయం

చదే విరజదర్శించితిరా. యీబంగారపు దీపపుసెమ్మెల నర్జునుడు శంతనుఁడు శ్రీవారికి సమర్పించినవి. ఆయాభరణములు మఱి కొన్ని కైంకర్యములు శ్రీకృష్ణదేవమహారాయలు చేసినవి.” అని వేఱ్వేరుగా నచ్చటి విశేషముల వారికిఁజూపుచుండిరి. ఆ యువతులు చూడఁదగు విశేషములన్నియుఁ జక్కఁగాఁజూచి అర్చకులకు మఱికొంత ధనమిచ్చి సంతోషపఱచి వారిని వీడ్కొని స్వామికి పునఃపునః ప్రణామంబులాచరించి దాసీజనముతో నీనలకు వచ్చుచుండిరి. ఇంతలో నొకపురుషుఁడు తన సేవకునితో స్వామియాలయమున ప్రవేశించుచుండెను. అతని వయసు ముప్పదివత్సరములుండును. మంచి యొడ్డుపొడవులు గలిగి పచ్చనిదేహముతో చక్రవర్తికుమారున కుండఁదగు బిఱుద చిహ్నములతో నొకసేవకుఁడుమాత్రము తన్ననుసరించి వచ్చుచుండ అల్లనల్లన నేతెంచుచుండెను. అతనిమోమున రాజసము తాండవమాడుచుండెను. వాని ముఖలక్షణములుచూడ నెంతటి యకార్యాచరణమునకైన వెనుఁదీయనివాఁడని తోఁచుచుండెను. అతనిచూపులు విషయలంపటుఁడనియు క్రూరస్వభావుఁడనియు చెప్పక చెప్పుచుండెను. అతఁడు ధరించిన వెలలేని సరిగంచుధోవతులును వ్రేలనుండు అమూల్యమణిఖచితంబగు నుంగరంబును చేత నతివిలాసంబుగా ధరించిన బంగారుబెత్తమును వానిశృంగారమున కొక వింతహొయలు గూర్చుచుండెను. అతఁడు పరిచారకునిచేత పండ్లు తాంబూలములు పళ్లెరముచే నెత్తించుకొని దేవాలయమున ప్రవేశించుచు ఆనందముల౯జూచుట తటస్థించెను. ఆతఁడక్లే యొక స్తంభముచా

టున నిలిచి వారిసోయగము చక్కగా జూచుచుండెను. యువతులు పురుషునిఁజూడలేరు. వారాలయములందలి చిత్రములఁజూచుచు నెమ్మదిగా నీవలకు వచ్చుచు నీక్రిందివిధముగా మాటలాడు కొనుచుండిరి.

వా:—అరవిందా! నేఁడు దేవునిదర్శనము చక్కగా నైనది. చూడఁదగు విశేషములన్నియుఁ జూచితిమి. అత్త మన రాక కెదురుజూచుచుండును. ఇఁక గర్భాలయమువీడి దాసీ జనులగలిసికొని పటకుటీరముల కేగుదము రమ్మా.

అ:—చెలీ, వాసంతికా యీదేవతాదర్శనముననైనను మాయమ్మబెంగ కొంచము తీఱునా?

వా:—సఖి, ఇట్టి యిక్కట్టులందీర్చుటకే కదా భక్తాభీష్టదుండగు శ్రీ రమారమణునిసేవించి శరణుజొచ్చితిమి.

ఈవిధముగా మాటలాడుకొనుచు నాసుందరు లాలయమునుండి యీవలకు వచ్చుచుండిరి. త్రోవలో కంబమువలుగుగానిలిచి తమ్ముజూచుచున్న పురుషుని జూచిరి. తోడనే మేలిముసుకులు సవరించుకొని చరచర యచ్చోటువాసి తమ దాసీ జనులను గలిసికొని యెదుట వేచియుండు పల్లకులనెక్కి పటకుటీరాభిముఖులై పోయిరి.

పురుషుఁడు:—నందకా, ఆకాంతామణులెవ్వరు?

నందకుఁడు:—ప్రభూ, వారు వర్ధమానపుర రాజకుటుంబమునకు జెందినవారై యుందురు. ఆపురమేలు సుదర్శనుఁడు పరివారయుతుఁడై యిచ్చటికివచ్చియుండెనని వినియుంటిమిగదా?"

పు:—ఔను, అతనికి జగన్మోహనాకారయగు తనయ గలదని విందుము. ఇపుడు గనుపించిన సుందరులలో నాతని కూతు రెవ్వరై నదియు నిర్ణయింపజాలకున్నాఁడ.

నం:—దేవరా, ఆకాంతలలో చిన్నయామె యాతని కూతురై యుండును. రెండవయామె మేనగోడలని తలంచెద.

పు:—తల్లిదండ్రులులేని మేనగోడ లాతని యొద్దనే యున్నదఁట గదా

నం:—ఔను, మహాప్రభో

పు:—నేఁ డా సుదర్శనునిఁగలసి కొన్ని విషయములు మాటలాడవలయును.

నం:—ప్రభూ, అతఁడు మన సామంతులలోనివాఁడే గదా.'' తప్పక మీయనుగ్రహమునకుఁ బాత్రుడగును.''

ఈవిధముగా మాటలాడుకొనుచు వారు దేవతాదర్శనముఁజేసి వెడలిపోయిరి. వర్ధమానపురాధీశుఁడు తనకుమారుఁడగు నశోకుని దేశమునుండి వెడలగొట్టినదిమొదలు జనని యగుసుశీల తనయునికై బెంగపెట్టుకొని ఆనాటికానాటికి కృశించుచు సహింపరానివేదన నందుచుండెను. అదిచూచి సుదర్శనుఁడు తీర్థయాత్రలమూలముననైన తన ప్రేయసి సంతాపము గొంత పాయునని కుటుంబయుతుడై తిరుపతి యాత్రకు వచ్చియుండెను.

# ఐదవ ప్రకరణము

## ఆలోచన

వర్థమానపుర కన్యకాంతఃపురోద్యానమున అరవిందా వాసంతిక లేకతంబున గూరుచుండి యేమేమో ముచ్చటించు కొనుచుండిరి. వారి సఖులు దూరమున పూవులను గోయు చుండిరి.

అ:—చెలీ, వాసంతికా, యేమో చెప్పబోవుచు సంకోచించుచున్నట్లున్నా వేల?

వా:—అడిగిన నీకుఁ గోపమువచ్చునని.

అ:—అబ్బా! నేఁడు మాట్లాడుటకు క్రొత్తపద్ధతి నేర్చినట్లున్నావే.

వా:—క్రొత్తవిషయము దెలియుటచే క్రొత్తగా మాట లాడుట.

అ:—అవి నేను వినఁగూడదా?.

వా:—సరే పప్పులేని పెండ్లియా, అంతయు నిన్ను గుఱించినదె.

అ:—(ఆతురతతో) ఏమీ!! అంతయు నన్నుఁగుఱించి నదా? ఏ మా విషయము?

వా:—నీకు పెండ్లియట!!

అ:—అబ్బా! నీ కెప్పుడు పరిహాసములే గదే, అడి గినదానికి చెప్పరాదా.

వా:—అదియే చెప్పుచుంటిని, నిన్నొక ప్రభువరున కిచ్చి మీ తండ్రి త్వరలో వివాహమొనర్చునట.

అరవిందహృదయ మాలోచనాధీనమయ్యెను. ఆమె యించుకసేపూరకుండి.

అ:—చెలీ! తనుగన్న బిడ్డలమగు మాకంటె నిన్నెక్కుడు ప్రేమమునఁ బెంచి పెద్దజేసిన నిన్ను వర్ధమానపుర రాణినిజేయకయే ముందుముందు తండ్రి నా పెండ్లి యోజింపనేల?.

వా:—నా వివాహము రాజ్యాంగవిషయములను సంబంధించియున్నది. ముందు నిన్ను బలీయుఁడగు నొకరాజునకిచ్చి, యాతని సాయమున కళ్యాణపురరాజులఁ జయించి యవ్వల మీ యన్నగారిని తనయొద్దకు రప్పించుకొనవలయునని, మీ తండ్రిగారి యుద్దేశము.

అరవింద మోమున భయవిషాదములు పొడకట్టుచుండెను. ఆమె యొకసారి నిట్టూర్పు విడిచి

'కళ్యాణపురరాజులకును మాయన్నకును సంబంధమేమి.' యనెను.

వా:—మీ యన్నగారికి తగువారివలన వారుదుర్బోధలఁ జేయించుచుండిరనియు, అందువలన ముందు వారిని ధ్వంసమొనర్చినచో, తనకుమారుఁడు తనకు విధేయుఁ డగునని యు, ఆ కారణమున ముందునుండి తనకు విక్రమసింహునిపై నున్న పగఁ దీర్చుకొనుట కవకాశము గల్గుననియు మామగారి యాశయము.

అరవింద మేనించుక కంపించెను. మరల ధైర్యముఁ దెచ్చుకొని యిట్లనెను.

అః—సఖి! మా తండ్రి కంతటి విహితుఁడగు రాజెవ్వరు.?

వాః—చెలీ! మీ తండ్రికొకరు విహితులేల? నీరూపమే యందఱను విహితులఁ జేయును.

అః—చాలుచాలు, ఉన్నదానిని జెప్పక నఱుమ పరిహాసములేల.

వాః—మొన్న తిరుపతియాత్రకుఁ బోయియుంటిమి గదా?

అ.—ఔను

వాః—మనమపుడు ఏకాన్తముగా స్వామిని సేవించి, ఆలయమునుండి యీవలకు వచ్చుచు, నా ప్రాంతమున నొక రాజవరుని జూచియుంటిమి జ్ఞప్తియున్నదా?

అః—(మొగము చిట్లించుచు) ఔను, ఎవరాతఁడు?.

వాః—అతఁడు కొండవీఁటి దుర్గాధ్యక్షుఁడగు నారాయణ గజపతి.

ఆ మాట వినినప్పటి కరవింద యొడలు కంపింప నారంభించెను. నారాయణ గజపతి, నిరంకుశుఁడనియు దుష్టవర్తనుండనియు, కాముకుఁ డనియు, ఎంతటి పాపమునైనఁ జేయ వెనుదీయనివాఁ డనియు, నామె యెఱుంగును. ఒక్కింత యూరకుండి మరల

"చెలీ ! సర్వనాశమునకు నాతండ్రికి తలంపును, అందులకు తోడా దురాత్ముని సఖ్యమును, గల్గినదని తలంచెద.

వా:—అట్లనియెదవేల, గజపతి చక్రవర్తికుటుంబములోనివాఁడు ఐశ్వర్యమున మనరాజలోకమునకన్న నధికుఁడు. యౌవనుఁడు. సుందరుఁడు. అట్టియెడ యువతుల కింక గోరఁదగినదేమున్నది!!

అ:—సద్గుణములు లేనివాని చక్కదనమేల? విద్య లేని ఐశ్వర్యమేల?

వా:—అన్ని విషయములలో నతనికన్న నధికుని ఎక్కడ నెదకి పరిణయమాడఁ గలవు.

అ:—అదియే మట్లనియెదవు. ఆ యధమునికన్న నుత్తములగువా రీ లోకమునలేరా !

వా:—ఉండవచ్చును, దానికేమి. సర్వవిధముల నీతఁడు మీ తండ్రికి విహితుఁడు గదా !

అ:—సన్నిపాత రోగికి హితవుగానున్న వేపకషాయ మందఱకు రుచించునా ?

వా:—సఖీ, మామ నిన్నాతని కియ్యఁదలంచి యుండెనుగదా. అతఁడు నిన్నుఁ బరిణయమాడ నెంచియున్నాఁడు. ఇందుకు నీవు వ్యతిరేకముగా నడువగలవా ?

అ:—సఖీ ! మా తండ్రి మూర్ఖతను అవివేకము నే నెఱుగనిదానను గాను. ఒకవేళ నంతగా వానిని వివాహమాడుట తప్పనిపనియైనచో, చేతియుంగరమున వజ్రములేదా ! కానిచో కరవాలము లేదా !

వా:—అరవిన్దా! అంత తెగువయేమి!

అ:—అనిష్టములకుఁ బాల్పడుబ్రతుకేల?

వా:—అట్టివి బుద్ధిబలముచే తప్పించుకొనజాలరా. అంతకు సాధ్యముగానిచో భుజబలములేదా!

అ:—ప్రాణసఖీ నీ ప్రబోధనవచనములచే కలతనొందిన నా మనస్సునకు తెలివిగల్గినది.

వా:—చెలీ, ఐన నీ వా విజయసింహుని వరించెదవా?

అరవింద తలవంచుకొనును.

వా:—మౌనం బర్ధాంగికార సూచకము.

అరవింద, వాసంతిక వైపు జూచుచు నేమియు మాటలాడ నేరకుండెను.

వా:—(నవ్వుచు)నేను నీ మనోహరుండనని భ్రమించి చూచుచుంటివా ఏమి!! నీ విభుఁడు నీ హృదయమున నున్నాఁడు.

అరవింద తలవంచి యుంగరమువైపుఁ జూచుచుండెను.

వా:—అదిగో, "విజయసింహ" యను పంచాక్షరీ మంత్రరాజ మా యుంగరమునఁ వజ్రములచే జెక్కబడి యున్నది. దానిం గడుశ్రద్ధాభక్తులతో, స్మరించుకొనుచుండుము. నీ యభీష్టసిద్ధియగును.

అరవింద సిగ్గుతోఁ గూడిన కోపముతో

"ఎంతమాటకారివే, యేమేమో గొడవలుదెచ్చిపెట్టి విసికించెదవు." అనెను.

వా:—ఇందు గొడవలేమున్నవి?. నీ కా మంత్రమున కన్న పరమార్థము వేఱొండు గలదా ?

అరవింద యొడలు పులకరించెను.

వా:—సఖి ! హృదయగోపన మేలఁ జేసెదవు? మామకును గజపతికిని వివాహసంబంధమగు సమాచారములు విశేషముగాఁ జరుగుచున్నవి. వివాహము సమీపించును. అవ్వల ఇల్లుగాలిపోవుచుండగా, బావిఁ ద్రవ్వఁ గోనినట్లవుదుపాయమాలోచించిన ప్రయోజన ముండదు. అన్నియుఁ జక్కగా యోజించుకొని నిన్నాతని కిచ్చుటకు మామ నీ యభిప్రాయమడిగిన అపుడేమి బదులు చెప్పెదవో!! మామకును గజపతులకును, భేదములు గల్పించి యేవిధముచేనైనను, మీ తండ్రిని విక్రమసింహునితో జేర్ప, నేమి తంత్రములు జేయవలయునో, మనలో మనము ముందుగాఁ సిద్ధపఱచుకొని యుండవలయును. నారాయణ గజపతి కఠము దుర్మార్గుఁడు. మామ విక్రమ సింహునిపైఁ గల విరోధమును కుమారుఁడు, తనకు వ్యతిరేకముగ నెచ్చటికో వెడలిపోవుట వారి దుర్బోధనల వలనను తలంపునను, ముందు రాఁబోవునవర్థములఁ దెలియనేరక గజపతితో సంబంధము నెఱపి వారిపై పగదీర్చుకొన నెంచియున్నాడు. ఇపుడు మనమూరకుండిన నీ రాజ్యమునకును, మన కుటుంబమునకును, ముప్పువచ్చును. గజపతి స్నేహముగానున్నట్లు నటించి, ముందు నిన్నును, అవ్వల మనరాజ్యమును గూడ నపహరించును. ఆ దురాత్ముని స్నేహమును వీడి విక్రమ సింహునితోఁ గలిసిన భద్రమని హితముబోధించిన మామ

వినఁడు. ఇఁక వీరియెడ భేదోపాయమును, ప్రయోగింపవల యును. ఇందును మీా యన్నగారును కళ్యాణనగరాధీశులును, మనకు సహాయులగుదురు. ఆ విధముగా మనరాజ్యమును గాపాడుకొని, యభీష్టసిద్ధి నందగలము. ఇఁక సిగ్గుపడి నీ యభి ప్రాయములఁ దాచరాదు.

అః—ప్రాణసఖీ! నీయెడలనా నాదాపరికము? నీకు నా మనోగతాభిప్రాయములు దెలియవా?

వాః—నీ మనోగతంబు లెఱుంగుటకు నాకేమి యోగ దృష్టి గలదా?

అః—త్రికరణములచే నే నా రాజకుమారుని వరించి యున్నాను. అతనిఁదక్క నితరుని మనోవాక్కాయ కర్మం బులఁ దలంపను.

వాః—(నవ్వుచు) నీవు మనసులోఁ గోరియున్న యాతని నే నెట్లు గుర్తింపగలను? పేరు చెప్పుము.

అః—అబ్బా! యెంత చతురవే! ఏ వీరుఁడు, పలువురుఱు పోటుగాండ్రతో నించుకయైన సంచలింపక పోరాడుచుండ కన్నులార గాంచి, విభ్రాంతి నొందితిమో, యే సరసుఁడు మనము తన పరిపంథికుటుంబములోనివారమని యెఱింగియు మనల తన మిత్రులగా భావింపనట్టిసౌజన్యమున కబ్బుర మందితిమో, యే యుదారుఁడు, తనకు మనమొనర్చిన కొలఁది యుపకారమును గొప్పఁజేసి, అమూల్యమగు తనవ్రేలియుంగు ళీయకమును మనకు బహుమానపూర్వకముగా నొసంగుటకు సంతసించితిమో, యే వీరాధివీరుని సుగుణాలంకారముల సకల

దేశజనులు గొనియాడుచుండ వీనులవిందుగా వినుచుందువో, ఒక్కొకతఱి నేనించుక పరధ్యానముననుండి పలుకకుండిన "పంచాక్షరి మంత్రమును జపించుకొనుచుంటివా" యని యే రాజకుమారుని నామాంకితంబులగు నక్షరంబుల నుగ్గడించి, నన్ను పరిహాసము జేసితివో ఆ కుమారునిదక్క నన్యుఁ దలఁపనైన నొల్లను.

వా:—పండితమానినీ, ఒక్కసారి, "విజయసింహు" డని చెప్పినచో నీ దీర్ఘ సమాసములు, యీ విశేషణములు, వెదక నక్కరలేదు గదా! పేరు చెప్పను సిగ్గుపడి, పాపము, పెద్ద యుపన్యాసమిచ్చితివి!!

వారీ విధముగా మాటలాడుకొనుచుండగా నొక పరిచారికవచ్చి, "అమ్మా! నాయనగారు పిలుచుచున్నారు." అని మనివి జేసెను. తోడనే, వారు సఖులతోఁగలసి, అంతఃపురమునకుఁ బోయిరి.

# ఆఱవ ప్రకరణము

## ప్రతికూలభాషణములు.

"అమ్మా! యీనారాయణ గజపతిని పరిణయమాడుట నీకు సమ్మతమేనా?" యని తన యాలోచనామందిరమున సోఫాపైఁ గూరుచుండియున్న సుదర్శనుఁ డరవిందను ప్రశ్నించెను.

అరవింద తలవంచి యూరకుండెను.

సు:-తల్లీ! యీసంబంధము నీకిష్టమేగదా?!

అ:-నాయనా! ఆతఁడు చాల దుర్మార్గుఁడనియు దురభిమానియనియు విందుము.

సు:-ఆతఁడట్టివాఁడని నీకెవ్వరు చెప్పిరి?

అ:-మంచిచెడ్డలు దాగునా? లోకమంతయుఁ జెప్పుకొనుచున్నది.

సు:-అది యసత్యము. సరిపడనివారెవ్వరో వాని నటుల దూషింతురు. అతఁడు చాలమంచివాఁడు. సుందరుఁడు-రాజాధిరాజు. విశేషించి మన యభ్యుదయాభిలాషి.

అ:-నాయనా! అది గోముఖవ్యాఘ్రము అదనుఁ జూచి మనలను మనరాజ్యమునుగూడ తన పొట్టను బెట్టుకొనును.

సు:-(విసువుతో) అమ్మా! నీకీరాజ్యాంగవిషయములలో జోక్యమేల? "కన్యావరయతే రూపం" అందురుగదా!! ఆతని రూపవైభవముల నెఱుంగుదువా?

అ:—(అసూయతో) వాని రూపవైభవములకన్న నధికు లీజగంబుల లేరా!?

సు:—ఉన్నచోఁ జెప్పుము చూతము.

అ:—తండ్రీ! మాయన్నను పిలిపించి వివాహమొనర్చి యౌవరాజ్య పట్టాభిషేకమొనర్పనిదే, ముందు నావివాహమున కేమితొందర?

సు: ఆదుర్మార్గుఁడు శత్రురాజులయాలోచనలవిని నాయందు ద్వేషమునహించి వెడలిపోయెను. ఇఁక వానిమోముఁ జూడను!! నారాజ్యమంతయు నాయనంతరము నీకే చెందింపఁ దలంచి యున్నాఁడ!!

అరవింద కనుదమ్ములనుండి యశ్రువులు ప్రవహింప సాగెను. కొంతసే పూరకుండి

నాయనా, కడుపారఁగన్నకుమారుని పగవానినివలె వెడలఁగొట్టించుటకు నీకు మనసొప్పినదా? ఈవిషయమున మాయమ్మ పుత్రునికై యెంత బెంగఁగొని కృశించి పోవు చున్నదో చూచుచుంటిరిగదా! ఇఁక నీదారుణాశయమును విని సహింపరాని పుత్రవియోగ దుఃఖమునకోడి యామె ప్రాణములవీడదా? అది యటుండ, కన్నబిడ్డలమగు మాకన్న నెక్కుడు గారాబమునఁ బెంచి పెద్దజేసిన నీముద్దుకోడలు వాసంతికకీ యుద్యమము దెలిసినచో నామె హృదయమెంత తల్లడిల్లును!! పుట్టిననాఁటినుండియు నామెను మన యశోకునకు బరిణయముచేసి వర్ధమానపురరాణినిఁ జేతునని, మరియు

చుంటివిగదా! కన్నకొడుకు కడగండ్లుపడుచు దేశాంతరముల పాలై పోవ నాతఁడేలఁదగు రాజ్యమును కూతునకుఁగట్టఁబెట్టుట న్యాయమా? ఇతరులీ యకార్యముల కేవగింపరా? దైవము దండింపడా!

సుదర్శనునకుఁ గోపమువచ్చెను.

ఛీ! కుమతీ! నీవుకూడ నీయన్నవలెనే యధికప్రసంగము లకు దిగితివా! మగవాఁడుగాన యెట్లులైనఁ బోనిమ్మని విడిచి తిని. నిన్నటుల నుపేక్షింతునని తలంచితివా?

అ:—తండ్రీ, మాయన్న నీయెడల నేమియపరాధ మొనర్చెను?.

సు:—వాఁడు నాకు పరమశత్రులగు కళ్యాణపురిరాజు లను గొనియాడి నన్ను నిందించెను.

అ.—నాయనా! కళ్యాణపురమువారు మనకు దగ్గఱ బందుగులుగదా! వారికిని మనకును విరోధములేల?.

సు:—దానికి చాల కారణములున్నవి.

అ:—ఉండవచ్చును. యిపుడీగజపతి మనకు విహితుఁ డుగా నున్నను మనరాజ్యము నేవిధముగానైన నపహరింపఁ దలంచుచుండును. పూర్వము అన్యోన్యబందుగులగు జయ చంద్రునకును పృథ్వీరాజునకును విరోధములఁగల్పించి వారి నిద్దఱిని ధ్వంసమొనర్చి యంతయు తానే యపహరించిన మహ మ్మద్ఘోరీవలె నీతఁడును మనరాజ్యముల నపహరించును.

సు:—అయిన నిపుడేమి సేయమందువు?

అ:—ఆ నారాయణగజపతికి నాయభిప్రాయమెఱింగించి వాని సఖ్యమునువీడిన మనకు భద్రము.

సు:—నీయభిప్రాయ మేమని తెల్పవలయును?

అ:—"వానిని నే వరింప"నని

సు:—అంతకన్న నధికుని మఱెవ్వరిని వరింతువు?

అ:—నాయనా, యిపుడా ప్రశంసయేల. ముందు మా యన్నను బిలిపింపుము.

సు:—ఛీ. అధికప్రసంగినీ! ఇందుకు నీయధికారమేమి!! నీపై నాకు స్వతంత్రత లేదా, "గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన" దన్నట్లు ఊరకే నాకు నీతులు నేర్పెదవు. తప్పక నిన్నా గజపతికిచ్చి వివాహముఁజేసి యాతనిబలమున విక్రమసింహుని జయించి యవ్వల నాకుమారుని ప్రశంసఁ దలపెట్టెద.

అ:—తండ్రీ! విక్రమసింహుఁను చాలమంచివాఁడనియు పరాక్రమశాలియనియు విందుము. అట్టివానితో విరోధముఁ బూనుట మనకు శ్రేయమా?

సు:—కాని వారలు మనలరక్షింతురనితలంచితివా!

అ:—జరిగినదానినిఁదలంపక ఇది మొదలుకొని వారితోఁ గలసి మెలంగినచో, తప్పక వారు మన కనుకూలురగుదురు.

సు:—చాలుచాలు. మీరిద్దఱు శత్రువులుగాని, బిడ్డలు గారు. పగవారిని గొనియాడుచు నాకు కష్టములుగూర్ప సాగితిరి.

అ:—వారు మనకెన్నటికి శత్రువులుగారు. గజపతి మాత్రము శత్రుఁడగును.

సు:—అతఁడు మనకు విషముబోసెనా!?

అ:—ఇపుడుకాదు. కొలఁదికాలములో సర్వనాశన మొనర్చును.

సు: (మండిపడుచు) ఛీ! వదరుబోఁతా. ఇఁక నోరు మూయుము. అనురూపవరునివెదకి ముద్దుగా నీయభిప్రాయ మడిగితిని. ఇంతటిమూర్ఖురాలవని యెఱుంగనైతిని. చూడు నిన్ను తప్పక గజపతికిచ్చి వివాహమొనర్చెద. ఇఁక నీ యాలో చనతోఁ బనిలేదు. ఇచ్చవచ్చినప్పు డిచ్చెదనని చెప్పుటకును కానిచో నియ్యననుటకును అతఁడేమి సామాన్యుడని తలంచి తివా! మహారాజాధిరాజు! చక్రవర్తియంతటివాఁడు!! తలంచి నచో బలిమిచేనైన నిన్ను గొనిపోవగలఁడు!!! చక్కఁగా యోజించుకొనుము. పొమ్ము.

అరవింద మాటలాడక యటులే కూరుచుండి నేలవంకఁ జూచుచుండెను. ఇంతలో నొకసేవకుఁడు సుదర్శనునకు నమస్కరించి "ప్రభూ, నారాయణగజపతి వద్దనుండియుత్తరము వచ్చిన"దని యొకజాబు నతనిచేతికిచ్చెను. సుదర్శనుఁడు కూతు నంతఃపురమునకంపి యాతనితో మాట్లాడుటకు రహస్యాలోచన మందిరమున కేగెను.

# ఏడవ ప్రకరణము

## మనోవ్యాధి

"పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే" అని జీవుల పురాకృతపాపకర్మము లాధ్యాత్మిక, ఆధిభౌతిక ఆధిదైవికములను మూడువిధములగువ్యాధులుగా పరిణమించును. అట్టియెడ "తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమక్రియాదిభిః" ఆవ్యాధుల నౌషధములవలనను దానములచేతను జపమూలమునను, హోమాదులవలనను నివర్తింపఁజేయగలరు. గాని, మనోవ్యాధి యనుదానికి మాత్రము మందులేదు. అట్టివ్యాధిని యెంతటి ఘనవైద్యుఁడైనను నాడీపరీక్షవలనగాని మఱి యెవ్విధిచేగాని కనుగొనఁజాలఁడు. ఎన్ని సంజీవనౌషధములఁ బ్రయోగించినను ఉపయోగముండదు. క్రమముగా నావ్యాధి మొదటి దశలో మనుజునికి నిద్రాహారములయం దరుచిఁగల్గించి కృశింపజేయును. రెండవదశలో శల్యములనుగూడ గరగించి మంచము బట్టించును. మూడవదశ మరణమును గలిగించును. ఇట్టిదానిని మొదటిదశయందే రోగనిదానమెఱిగి తగవగు చికిత్సఁజేసినచో రోగి జీవించును. రెండవదశలోఁ గనుగొనిన రోగనివారణము సంశయాస్పదము. మూడవదశకువచ్చినచో మరణముతప్పదు. అట్టియెడ వైద్యుడు రోగలక్షణములను గుఱుతించి ఔషధమొసంగవలయును. కానిచో వ్యాధికన్న ముం దౌషధముతే రోగిని జంపును.

అరవిందకు కొన్నిరోజులనుండి జ్వరము వచ్చుచుండెను. ఆమె కన్నము రుచించుటలేదు. ఉబుసుపుచ్చుటకైన నెవ్వరితోడను మాటలాడదు. తలిదండ్రులు రాజవైద్యునిచే నౌషధసేవఁ జేయించుచుండిరి. ఆనాఁటికానాఁటికి జ్వరము హెచ్చుచుండెనేగాని తగ్గుటలేదు. శరీరము చాలచిక్కి తెల్లబాఱిపోయెను. ఈజ్వరము తగ్గుటలేదేయని వైద్యునిప్రశ్నింపనిదిగో 'ఈయౌషధముతో తగ్గును. ఈయౌషధముతో తగ్గు' నని తమయొద్దనున్న పెద్దలనాటి కుప్పికట్లన్నియు వాడుచుండెను. వ్యాధి తగ్గుటలేదు. అంతట వారు మఱియొక వైద్యునికిఁజూపగ నిది గ్రహాలక్షణమని విభూతి కుంకుమలు మంత్రించి యొసఁగసాగెను. అందునను గుణములేదు. సోదులు పెట్టించిరి. కార్యము లేదయ్యెను, ఆమె నానాటికి మంచము నుండి లేచుటకుఁగూడ శక్తిలేదయ్యెను. పడుకనుండి లేవవలయునన్నచో భ్రమ. మాటలాడవలయునన్న నాయాసము గలుగుచుండెను. సుదర్శనున కేమియు దోఁచుటలేదు. అతఁడు వెఱ్ఱియెత్తినవానివలెఁదిరుగుచు కనిపించిన వైద్యులనెల్లరప్పించి కూతునకౌషధము లిప్పింపసాగెను. ఆమెతల్లి సుశీల విచారము చెప్పవలయునా. ఒకవంక దేశాంతరముపాలైన కొడుకునకై చింతించుచు కృశించిపోవుచుండ గోరుచుట్టుపై రోకటిపోటను నట్లు కూతునకుఁగూడ భయంకరమగు వ్యాధి సంభవించెను. ఇఁక నామె సంతాపమునకు మేరయుండునా?

పాప మాసుశీల కూతునకు జబ్బుచేసినదిమొదలు నిద్రాహారముల వదలినది. ఎప్పుడుచూచినను తన తనయ

మంచమునొద్దనే కూరుచుండి కన్నీరుమున్నీరుగాఁ గార్చుచుండెడిది. వాసంతిక బెంగమొగముఁ బెట్టుకొని తన ముద్దు మరదలగు అరవిందయొద్ద గూరుచుండి దాసీజనముచేయు నుపచారములఁ దానేజేయుచు కడుమెలకువతో నౌషధములు సేవింపఁజేయుచు సుశీలకు ధైర్యముఁ జెప్పుచుండెను. కాని యామె హృదయమునఁగూడ సహింపరానివేదన నందుచుండెను. అరవింద యామెకు రెండవప్రాణముగదా! కొన్నినాళ్ళామె అరవిందవ్యాధినిదలంచి భయమందుచుండెను. ఆమె యించుక నిదురించునప్పుడు చక్కగా నామెముఖమును బరిశీలించును. మెలకువగల్గినయవ్వేల చేతినాఁడిని పరీక్షించును. వాతపిత్తశ్లేష్మములన్నియు సరిగానున్నవి. కాని యేకారణముననో దేహమున నించుకయు బలములేకుండుటచే ధాతువులు శోషించినవి. దేహముచిక్కి తెల్లబడియున్నది. ఈలక్షణములన్నియు వాసంతిక గమనించినది. దాసదాసీజనంబుల నందఱను బోవఁబంచి సుశీల వినకుండునట్లు అరవిందతో నీవిధముగాఁ బ్రశ్నించెను.

'అరవిందా, నీ శరీర మెట్లున్నది?'

'నీరసముగా నున్నది'

'ఇన్ని యౌషధము లిచ్చినను, తగ్గుటలేదు. ఈ వ్యాధి యెట్టిదో తెలియకున్నది.'

నిట్టూర్పు విడిచి,

'ఏమో—మనమేమి చేయఁగలము!'

'సఖి, నే నొక్కటడిగెదను. దాచక చెప్పెదవా?'

హీనస్వరముతో—

'అడుగుము చెప్పెదను.'

'ఎన్ని యౌషధములకును తగ్గక నానాటికి వ్యాధి హెచ్చగుచున్నది, కారణమేమి?'

'నేనేమి చెప్పగలను?'

'ఇది తప్పక మనోవ్యాధియని యూహించెదను.'

అరవింద మూటలాడకుండెను. వాసంతిక యామె నిద్దంపు లేఁజెక్కులఁదన కరపల్లవమున నల్లనల్లననివురుచు, నీవిధముగాఁ బ్రసంగించెను.

'చెలీ! మామ నీ పెండ్లి విషయమునఁ జేయుప్రయత్నములెఱింగి బెంగగొంటివా? ఈ తీరున దిగులొంది, యనారోగ్యములకు లోనగుట తగునా? చేయఁదగు కార్యములను యోజించుకొని, ధైర్యమూని కార్యాచరణమునకుఁ గడంగవలయును.

అ:—సఖీ! సాహసించి, మగవారికి ప్రతిఘటించి, మనము పూనినకార్యమును నెఱవేర్పగలమా!? మన కనుకూలింపని కార్యముసాధింపగలమా? అన్న దేశాంతరముల పాలయ్యెను. తండ్రి నాపై పగఁబూని దుష్టుఁడగు గజపతికి బలినీయనెంచెను. ఇఁక నన్నీ యాపదనుండి తప్పించి రక్షించువా రెవరున్నారు?

అని యామె వెక్కి వెక్కి యేడ్వసాగెను. వాసంతిక నయనములనుండియు, అశ్రువులు ప్రవహింపసాగెను. ఆమె యించుక సేపటికి ధైర్యమూని—

అరవిందా! నామేనఁ బ్రాణము లున్నంతవఱకు ని న్నా నీచునకు కన్నెత్తియైననుఁ జూడఁజాలను!!

అ:—అబలవగు నీవేమి చేయఁగలవు?

వా:—అబలనని తలంచితివా? దుష్టరాజగర్వనిర్వాపణ మొనర్చుతఱి భయంకర కాళికామూర్తినగుదునని యెఱుంగుము.

అరవింద ఆమె ధైర్యవాక్యముల కబ్బురమందెను. వాసంతికపైఁ జేయివైచి,

'సఖి! నీ వట్టి వీర వనితవే!! ఐననుయిందుకు చేదోడు వాదోడుగా, మనకు విహితులగు పురుషులుండవలదా!' అనెను

వా:—అందులకు వెదకనక్కరలేదు. ధైర్యోత్సాహముల నొసంగిన దేవుఁడు, తగు సహాయము నీయఁడా.

అ:—బలీయమగు చేయూత తెస్టను, సేకరింపక దైవముపై భారమువైచి సముద్రమున నుఱుకవచ్చునా?.

వా:—ధైర్యమూని ఉఱికినచో, నా దైవమే చేయూత నిచ్చి రక్షించును.

అ:—మా యన్నయే, యిటనుండినయెడల, నెంతటి ఘనకార్యమైనను, సాధించి నా ముద్దు చెల్లించునుగదా! ఇపుడు మనముచేయు ప్రయత్నములు, తండ్రిగాని, ఇతరులు గాని యెఱింగినచో గతియేమి?!

వా:—ఇపుడు మీ యన్న యెచ్చటికేగెనని తలంచితివి? ఆయన సుఖముగా నున్నారు. నీవు దిగులొందవలదు.

అ:—(ఆత్రముతో) కుశలియై యున్నాఁడా? వానిని తనప్రాణములుండగ జూడఁగల్గుదునా?

వా:—అమ్మా! అమంగళము నీ నోటినుండి రానీయకుము. మీ యన్న సుఖముగా నున్నారు. ఆయన చూపంతయు, మీ తల్లిమీఁదను, నీమీఁదను వున్నది.

అ:—అటులున్న పుత్రవియోగముచేఁ గుందిపోవుచున్న మా యమ్మకు తనక్షేమముఁ జెప్పక యూరకుండునా?

వా:—సఖి! మామకు మీయన్నగా రీదేశమున నడుగు వెట్టిరని, తెలిసినచో, నాయనపై కఠినముగు నుత్తరువు చేయక మానరు. బలవంతముగా మన పురమునకు వచ్చినచో, తండ్రికి వ్యతిరేకించినట్లగును. దైవ మనుకూలించువఱకు కీ విధముగా నుండిన నవ్వల నందఱము గలసికొనవచ్చును.

అ:—అటులైన మా యన్న నా యభిప్రాయమున కంగీకరించునని తలంచెదవా?

వా:—సందేహమేమి!? మనము చేయఁబూనిన కార్యములకు సహాయుఁడై, యా పనుల నెఱవేర్చును.

అ:—ఇన్ని ప్రయత్నములు జేసినను నన్నా పురుషసింహుఁ డనుగ్రహించునా? అదియునుంగాక మా యయ్య విక్రమసింహునిపై కయ్యమునకు కాలుద్రవ్వుచుండెనుగదా?

వా:—ఎవరెట్లున్న నేమి, నీపై యా విజయసింహునకు మిక్కుటమగు ననురాగమున్నది.

అ:—అది యెట్లు? నన్నాతఁ డెఱుగఁడు గదా!

వా:—ఎఱుగఁడా, ఆ దినము నీ పై యనురాగయుత ములైన వీక్షణంబులఁ బఱపుచు నాతో, 'మీ నెచ్చెలికి ప్రియముగూర్చుచు కలకాలము, వీని గూడియుండవలయు నని ముచ్చటపడుచున్నాఁడ'నని పలికిన పలుకున కర్థమేమి?

అ:—మీ నెచ్చెలికి అనగా, నీ మిత్రునకు, ప్రియము, అనగా "స్నేహమున మెలంగుచుండఁ దలచుచున్నా"నని యర్థము.

వా:—అదిగాదు మీ నెచ్చెలియగు యరవిందకు, ప్రియుడనై మెలంగవలయునని యున్నది, యనునది ప్రస్తుతార్థము బహిరంగముగాఁ జెప్పిన యది యప్రస్తుతార్థము.

అ:—ఈ యభిప్రాయము సరియైనదియా ?

వా:—ఇంకను సందియమా? తాను మనలఁ వీడ్కొని పోవుచు మరల నిన్ను సమీపించి, దయానురాగములగు చూపులతో "చెలీ" యనబోయి "చెలికాఁడా పోయివత్తు నోయి పెద్దవారి వైరము లెంచక, మనము కలిసి మెలసి యొక్కటిగానుండ నను గ్రహింపుము. సెలవిమ్ము"అని వీడ్కొనుట స్మరింపవా?.

అరవింద మేనుగగుర్పొడిచెను. ఆమె తలవంచి యూరకుండెను.

వా:—చెలీ! ఇఁక జాలముసేయరాదు. నారాయణ గజపతి "నిన్నెపు డెపుడు పరిణయమాడుదునా"యని త్వర పడుచున్నాఁడు. నీదేహము చాల జబ్బుస్థితిలో నున్నది. ఇఁక

నీ మనోగతాభిప్రాయముల నెఱింగించుచు నీ మనోహరున కొక యుత్తరము వ్రాయుము.

అ:—సాహసించి యాడువారీపనిఁ జేయవచ్చునా.?

వా:—రుక్మిణీ కళ్యాణమును జదువలేదా! జాగు సేయక నా పనుపుసేయుము. దైవ మనుకూలించును.

అ:—నీ యాజ్ఞ నాకు దైవాజ్ఞయగు గాక!!

వా:—అరవిందా! యిఁక చింతవీడి ధైర్యమున నుండుము. రేపటినుండియు కార్యమునకై ప్రయత్నించెద.

వా రిట్లు మాటలాడుకొనుచుండగా, సుశీల యౌషధము దెచ్చెను. అరవింద కౌషధసేవ యొనర్చి యాహారమును భుజింప వాసంతికతోఁ గలిసి సుశీలవెంట లోనికరిగెను.

# ఎనిమిదవ ప్రకరణము

## ఆవేశము.

ఆవేశమనునది మనస్సునకుఁగల్గు నొకవిధమైన భావన. అది రజ్జు సర్పభ్రమవంటిది. ఏదియో యొకదేవత యొకానొక కారణమున తనపై నావహించునట్లూహింతురు. తోడనే యానందాశ్రువులు జాలువారును. శరీరము గగుర్పొడుచును. తనచుట్టుఁజేరియుండు సమూహముకొలఁది విపరీతభాషణములు, జనులభయపెట్టుట తనకు మ్రొక్కుబడులు చెల్లింపుఁడని శాసించుట వచ్చి నమస్కరించినవారికి వరములిచ్చుట యిట్టిలక్షణము లావేశమువచ్చినవారియందుఁ గనుపించును. వారినే గణాచారులందురు. పామరులా గణాచారులకు దండములుబెట్టుట, ధూపములువేయుట, వారిమాటలనమ్మి వేఁటలిచ్చుట, జాతరలు కొలుపులుచేయుట మొదలగునవి యాచరింతురు. వారి దయవలననే ప్రపంచమంతయు నిలిచియున్నదని, వారలభావన. ఆగణాచారులకు ప్రత్యక్షముగా దేవుఁడు గనుపించి మాటలాడుచుండునని వారినమ్మకి. అట్టి నమ్మకఁ గలవారిలో వర్ధమాన పురాధీశుఁడగు సుదర్శనుఁడొకఁడు. ఒకనాటి మధ్యాహ్నము వాసంతిక తనమేడలో గుర్చిపైఁగూరుచుండి కూనిరాగములు దీయుచుండెను. ఆమె యప్పుడప్పుడు విలాసముగాఁ దనలోతాను మనోహరస్వరమున పాటలు పాడుకొనుచుండు స్వభావముగలది. నేఁ డా రాగము లట్లుండలేదు. అవి

వెఱ్ఱివెఱ్ఱిరాగములలో వికారస్వరములతో వినువారికి నవ్వు వచ్చునట్లుండెను. పరిచారిక లారాగములువిని కడుపులుబ్బ నవ్వుచుండిరి. క్రమముగా నారాగములుముదిరి యామె తల ద్రిప్ప నారంభించెను. దాసీజనములునవ్వుచు నామెను సమీపించి 'అమ్మా యివియేమి వెఱ్ఱిరాగము'లని ప్రశ్నించిరి. వారి కామె జబాబీయలేదు. రాగములు పెద్దవయ్యెను. తలఁద్రిప్పుట అధికమయ్యెను.

ఆకాంత ప్రొద్దుననే తలయంటి స్నానముఁజేసి కృష్ణసర్పంబులంబోని తననిడుద పెన్నెఱులను కీల్గంటుగా వైచికొని యుండుటచే తల విపరీతముగాఁ ద్రిప్పుటవలన నాముడివీడి మొగమంతయుఁ గప్పుకొని చిక్కుబడుచుండెను. దాసీజనము ఇదియొక భూతావేశముగా నుండునని భయపడి పరుగునఁబోయి రాజపత్నికెఱింగించిరి. ఆమెయు తన ముద్దుకోడలికిఁ గల్గిన దొసగునకు వగచుచు పరుగెత్తుకొనివచ్చి యామె వికారవిన్యాసములఁజూచి దిగులొంది దుఃఖించుచు అటులే కొయ్యవడిపోయెను. ఆమె కశోకుఁడు ప్రాణమును అరవిందా వాసంతికలు చెరియొకకన్నుగదా!! సుదర్శనునకీ సమాచారము దెలిసినది; తోడనే యాతఁడువచ్చి యామెను రాజవైద్యులకుఁజూపెను. వైద్యులు "ప్రభూ యిది రోగలక్షణముగా"దని చెప్పిరి. ఆమె వికారపుఁజేష్ట లధికమగుచున్నవి. ఊరక చేతులుద్రిప్పుచు కన్నులు నులుముకొనుచుండుటచే నామె నేత్రములనుండు కాటుక మోమునకంతయుఁ దగిలి నల్లగా వికారముగానుండెను. అందుకుఁదోడు వెలిదమ్మి రేకులంబోలిన యామె విశాలనయ

ములు[దిప్పుచు వికారముగానవ్వుచు పండ్లు కొఱుకసాగెను. అదిచూచి యచ్చటి వృద్ధపరిచారిక లిదియొక దేవతావేశము గాని మఱియొకటిగాదని నిశ్చయించిరి. తోడనే సుదర్శనుఁ డామెపై పసుపునీళ్లుచల్లించి సాం[బ్రాణి ధూపములువేసి నమ స్కరించెను. వానికి గణాచారులనిన మిక్కిలి భక్తియు భయమును నమ్మకమును గలవు. ఆతఁడు సాష్టాంగముగా నమస్కరించి "అమ్మా నీవెవ్వరు? శక్తివా లేక దేవుఁడవా? భూతమవా? దయయుంచిచెప్పుము. నీయభీష్టము నెఱవేర్తును. నాకుటుంబమును నారాజ్యమును గాపాడుము. మాయరవిందను [బదికింపుము." అని దండములు బెట్టసాగెను. దేవత యించుక శాంతించి యీవిధముగాఁజెప్పెను. "నేను దుర్గను శ్రీశైల పర్వతమునందలి యొకపేటుపై వెలసియున్నాను. నీవు సకుటుం బముగా నచ్చటికివచ్చి రాబోవు శుక్రవారముమొదలు నెల రోజులు నాకు నిత్యదీపారాధనా నైవేద్యము లర్పించుచు ఉత్సవములఁజేయింపుము. అచ్చట నాభక్తుఁడొక్కరుఁ డున్నాఁడు. నన్ను వానిచే నారాధింపించవలయును. అతఁడు మణిమంత్రౌషధములఁ జక్కగా నెఱింగిన సిద్ధుఁడు. ఆతనిచే నీకూతునకు [ప్రతిదినము మంత్రతీర్థమిప్పించుచు నాతఁడు చెప్పి నట్లు నడుచుకొనుచుండవలయును. ఈవిధముగాఁజేసిన నీతనయ కారోగ్యము గల్గును. ఇట్లొక నెలరోజులుమాత్రముజరిపి నాప్రసాదమునంది మరల మీరు రాజ్యమునకు రావచ్చును. ఇదిమొదలు నన్నుపుడపుడు గొలుచుచుండవలయును. నీబిడ్డను తగు పరివారముతో నటనిలిపి నీవు మరల నీపురమువచ్చినను

ఆమెను నేను గాపాడికొనియెదను. నీవిఁక నీవిషయమై యోచింపరాదు. అని యాశక్తి యూగుచుండెను.

సుదర్శనుఁడాశక్తికి మరల దండముబెట్టి "అమ్మా నీవు చెప్పినటుల నడచుకొనియెద. రేపు శ్రీశైలమునకు పైనము సాగించెద. మాయరవిందను బ్రతికింపుము."

(శక్తి) "నీభక్తికిమెచ్చితి. నీకు మేలగుగాక" అని పెద్దరాగముదీయుచు వెనుకముందుల కూగియూగి యామె యట్లే క్రిందఁ బడిపోయెను. శక్తి వదలిపోయినదని సుదర్శనుఁడు దాసీజనముచే నామెకు శైత్యోపచారముఁ జేయింప విశ్రాంతిభవనమునకుఁ బంపెను.

# తొమ్మిదవ ప్రకరణము

## ప్రణయ సందేశము.

ప్రపంచమున అన్నిపట్టణములకంటె కళ్యాణనగరము కడుశోభావంతమై కుబేరునివాసమగు అలకాధామమువలె నొప్పుచుండెడిది. ఆపురమునకు నాలుగుప్రాకారములు గలవు. అందు మొదటిప్రాకారమున చెరువులును వరిపొలములును ఆకుదోటలు వ్యవసాయదారుల గృహములుగలవు. ఆచెరువులతివిశాలములై తియ్యని జలములచే నొప్పుచుండును. పొలములు ముక్కారులు సస్యవంతములై పండి ధరణిపై కొరిగి ధాన్యలక్ష్మి యాపురలక్ష్మికి వినమ్రతజూపెనో యనునట్లు తోచుచుండెను. రెండవప్రాకారములో సామాన్యోద్యోగుల యిండ్లును, కర్మకారుల గృహములును, వ్యాపారులయిండ్లును, వేశ్యావాటికలును, పుష్పలావికా మందిరంబులును, రక్షకభట మందిరంబులును వరుసలప్రకారము గట్టబడియుండెను. మూడవ ప్రాకారమున బ్రాహ్మణవీధులును రాజవీధులు పెద్దపెద్ద వర్తక రథ్యలు కర్మాగారములు గలవు. ఉద్యానవనములు కచ్చేరీ సావడులు గరిడీశాలలు నాట్యశాలలు విద్యాశాలలు వైద్య శాలలు గలవు. నాల్గవప్రాకారమున మహారాజభవనములును అంతఃపురోద్యానములును మంత్రిసేనాధిపతుల సౌధములును ఆకాశమునొరయు నున్నతిఁగలిగి లోకరమణీయములై యలరుచుండెను. అందు రాజమందిరము తెల్లనిగచ్చుచే నిర్మింపబడి కైలాసపర్వతమున కెనయగుచు నాలుగువైపుల

నెత్తగు హాజారములతో దేవేంద్రమందిరంబగు వైజయంతం బునుబోలె నతిసుందరమై యలరారుచుండెను. దానిప్రక్కన యువరాజభవన ముండెను. అదియు రాజభవనమువలెనే యతి మనోహరమై చూచువారల కబ్బురము గొల్పుచుండెను. ఆభవనమునకు ప్రతివాకిలియొద్దను సువాసనలుగల మల్లె సంపంగి తీగెలును విలువంపులగు తోరణంబులతీరునను నల్లించియుంచిరి. ఆమందిరమునఁ జలువఱాతిగోడలపై ననేకములగు చిత్తరువు లమర్పబడియున్నవి. మఱియు నందు నేలలపై రత్నకంబళ ములు బఱచియుండిరి. అందు సోఫాలు, కుర్చీలు, వేఁకువేలు కాచదీపములు, సువాసనాధూపములుగిల్గి చూపరుల కత్యా శ్చర్యముఁ గల్గించుచుండెను. దానిప్రక్కననే యువరాజు ఉద్యా నమున్నది. అందలివృక్షములు నిత్యఫలయ కుసుమఫలో పేతంబులై ఇంద్రనందనోద్యానంబున కెనయగుచుండెను. అందలి జలయంత్రము లేనుగులవలె నిర్మింపఁబడి తుండములు పైకెత్తి నీరములను బైకెగఁజిమ్ముచున్నట్లుండెను. ఆవనమున వివిధజాతి వృక్షముల నొక్కొకవిధమగు నెత్తుగానుండునట్లు పెంచి చిత్రవిచిత్రములగు వ్యూహములుగా సమర్చియుంచిరి. అందు చలువఱాళ్లతో ఆనుడుకుర్చీలు గట్టబడియున్నవి. ఆవనముమధ్య క్రీడాసరోవర మొకటిగలదు. అందు నిర్మలమైన చల్లనిజలము నిండియుండెను. దానిచుట్టును చలువఱాళ్ల సోపా నము లమర్పఁబడియుండెను. ఆకొలనునుండియే వివిధములగు నాకృతులుగల జలయంత్రములతో నావనమునకు నీరు వచ్చు చుండెను. ఆకాసారతీరమున నొక లతామందిరము గలదు.

అందు చంద్రకాంతవేదిక యొకటి యమర్పఁబడియుండెను. దానిపై యాపురమేలు విక్రమసింహుని కుమారుఁడగు విజయ సింహుఁ డొంటిగా గూరుచుండి యొకయుత్తరము నీవిధముగాఁ జదువుకొనుచుండెను.

అతఁ డాజాబునొకసారి చదువుకొనియెను. పదిసారులు జదివెను. తనివిఁజెందలేదు. మఱిపదిసారులు పఠించెను. జాబును మడచి చొక్కాజేబునందుంచి తనలో తానీవిధముగా మాట లాడుకొనుచుండెను.

'ఆహా! ఆ అరవింద నిక్కముగా నరవిందయే!! కానిచో నిట్టి వచోమాధుర్యమును పదలాలిత్యమును అలవడునా!! ఔరా! ఆనాఁడు రాజకుమారోచిత వేషమునవచ్చి నన్నాపద నుండి తప్పింప క్రూరులగు పోటుకాండ్రయెడఁజూపిన యామె శౌర్యము వర్ణనాతీతముగదా! అట్టి యాబాలికను యాపద నుండి యుద్ధరింపని నా బాహుబలమేల! ప్రథమసందర్శనముననే యాకాంతామణికి నాయం దనురాగముగలిగినది. ఆనాఁడు కృతజ్ఞతాపూర్వకముగా నాయుంగరము నొసంగినపుడు కంపిత హస్తములతోఁగై కొని యనురాగరసములు వర్షించుచూపులఁ నాపైఁ బ్రసరింపజేయుచు నేను తనమోముఁ జూచినతోడనే వేఱొకవైపునకు మరల్చెను. నేనాభావమునుగుఱించి కొన్ని నర్మగర్భములగు సంభాషణములు జరుప వలపులచే పులక లెత్తిన చెక్కుటద్దములతో నాకు నయనానందంబుఁగూర్చె. వసంతుఁడను పేరనున్న యాతఁడామె మేనమరదలగు వాసంతిక

గ్రహించినట్లున్నది. పాపము తనతండ్రిచేయు దుండగములకు భీతయై దిక్కుగానక పరితపించునపుడా వాసంతికయే యామెకు ధైర్యముఁజెప్పుచుండ బోలు.

ఆహా! ఎంతటి కుశాగ్రబుద్ధి యావాసంతిక!! 'మిమ్ముఁ జూచినదిమొదలు మా యరవిందుఁ డరవిందయే యయ్యె'నని ద్వంద్వార్థముగా మాటలాడినది. హా! అరవిందా! ఆసందర్శనము మొదలు నీవు నాహృదయారవిందవాసినివై యుంటివి. నీవంటి ప్రేమమయస్వరూపిణిని ప్రేమింపకున్న నీలోకమున నిఁక ప్రేమమునకు తావెక్కడ అని జాబువిప్పి

ఉ. శ్రీయుతమూర్తి, యో విజయసింహ మహీవరనీపదంబులన్
బాయని భక్తినెల్లపుడు భావమునందున నిల్పి సేవలన్
జేయఁగనుత్సహించునను జెచ్చెరదాఁగొనిపోవయత్నముల్
సేయుచునున్న వాఁడొకఁడు శీఘ్రమె నన్గృపఁజూచిప్రోవవే.

ఆహా! ప్రేమరసానుప్రాణితంబగు నీపద్యమందలిభావములు నాహృదయమును గరగించుచున్నవి. ఔరా ఈవిదుషీమణి కవయిత్రిగూడనా? కాకున్నచో నీచందమున పద్యములల్లు సామర్థ్యమలవడునా?"

అని మరల జాబువిప్పి

సీ. గజపతికే నన్నుఁ గట్టిపెట్టెదనంచు
పగఁబూని మాయయ్య పట్టుఁబట్టె,

హా! దుర్భరము దుర్భరము!! (మరలజాబుజూచి)

సబలుఁడౌ గజపతి ప్రబలమోహాంధుఁడై
బలిమి నన్గొనిపోవఁ దలచుచుండె

(క్రోధముతో) దురాత్మా! నీకాయువుమూడినది.
(జాబునుజూచి)

నాముద్దుచెల్లించి ననుగారవించుమా
యన్న దేశములపాలయ్యె మున్నె

అయ్యో! యెంతకష్టము (మరల జాబుచదువును.)

కాపాడి నాముప్పు గడపువారినిగాన
కెంతయు నామది వంతనొందె.

హృదయేశ్వరీ నేనున్నాఁడఁ మరల లేఖనవలోకించి)

గీ॥ సరససౌజన్యమూర్తినీ చరణములనె
తపఁ నితరంబుఁ దలఁపని దానవె న
నన్ను బల్మిని బెండ్లాడ నున్నవాఁడు
యెవరివేఁడుదు ననుగావ నేదిదిక్కు.

అహా! ఈదీనంపుభావంబులజూపు నీముద్దుపద్దములకు నామనసుకరగి నీరై ప్రవహించుచున్నది. (కమ్మనవలోకించి)

ఉ॥ ఏవిధితాళుదాన హృదయేశ్వర నాజనకుండు క్రూరుఁడై
ఈవిధిపాపచిత్తునకు నిచ్చెదనంచు ప్రతిజ్ఞఁబూనె ము
న్నావసుదేవనందనుఁడు నర్మిలిరుక్మిణి గొన్నలీల నో
భూవరపుత్ర నన్ను దయఁబ్రోవవె ప్రేమము నుద్ధరింపవే.

మానినీమణీ! అటులే పరిపంథిరాజ గర్వనిర్వాపణ
మొనరించి నిను దరింతు (మరల జాబుఁజూచి)

గీ॥ అహితు పట్టినటంచని యాత్మ నెంచి
మిన్నకుండెదవేమొ నీమీఁద ప్రేమ
జిక్కి సగమాచు మోదంబు దక్కియుండు
వినుతగుణశౌర్య, నీయరవిందనేఁడు.

ఇట్లు యరవిందలేఖ వక్షముపైఁ జేర్చుకొని "హా నీవు నా యరవిందవే. ఇఁక హరిహరాదు లడ్డమైనిలిచినను నిన్నుఁ గాపాడెద. అయ్యో! యెంతమూర్ఖుఁ డా సుదర్శనుఁడు!! కడు పారఁగన్న ముద్దుపట్టిపై దయవీఁడెను!! ఏలవీడఁడు?! విరోధము సాధింపఁబూనిన రాక్షసస్వభావులకు వివేకముండునా?"

అని అతఁ డీ విధముగా యోజించుకొనుచుండగా నొక మహాపురుషుఁ డా యుద్యానమునకు తనసేవకుఁడు వెంటరా వాయుసేవనమునకై యల్లనల్లన నేతెంచుచుండెను. అతఁడు సన్నని వెలిపట్టుధోవతులుధరించి యట్టిచొక్కాయయే దొడఁగికొని సన్నని తెల్లజరీయంగవస్త్రము పల్లెవాటుగా వేసికొని పాదములకు నీలవర్ణముగల అందమైనముచ్చెలు దొడగికొని చేతనొక బంగారుబెత్తముఁబట్టి తనసేవకుఁడు మార్గముఁజూప నుద్యానవనరామణీయకములఁ దిలకించుచు నిటువచ్చుచుండెను. అతడు మంచి యొడ్డుపొడవులును అందులకుతగిన లావునుగలిగి మనోహరమగు చామనచాయవర్ణముగల దేహముతో నెల్లరకు ప్రియదర్శనుఁడై యుండెను. అతనికి వయస్సు ఇంచుమించుగ నలుబదియైదు వత్సరములుండును. ఆపురుషునిమోమున శాంతగంభీరభావంబులు తాండవమాడుచున్నవి. విశాలమగు ఫాలమును చేరలకెక్కుడగు కన్నులును దీర్ఘమనోజ్ఞనాసికయుఁ

వెడదయగు నురంబును పిక్కలవఱకు వ్రేలాడు పొడవైన చేతు లును మృదుమధురములగు గంభీరభావవిలసనంబులగు భాషణం బులును జూడ నాతఁడు త్తమ ప్రభువరుండనియు కుశాగ్రబుద్ధి యనియు దూరదృష్టిగలవాఁడనియు పరేఙ్గితజ్ఞుండనియు దయా మయుండనియు కడు నుదారబుద్ధిగలవాఁడనియు వీరాధివీరుఁ డనియు చెప్పకచెప్పుచుండెను. అతఁడటులే వచ్చుచు దూరము నుండియే విజయసింహునిజూచెను. అతఁడేమో దీర్ఘాలోచనఁ జేయుచున్నట్లు తెలిసికొనెను. అచ్చటనే యూగి యాతని వైఖ రులు చక్కగాఁ జూచుచుండెను.

విజయసింహునకు మఱియొక యాలోచన లేదు. అతఁడు మాటిమాటికి జాబువిప్పి తనలోఁ చదువుకొనుచు మరల చొక్కాయిజేబునందు పొందు పఱచుచుండెను. ఇదియంతయు ఆ పురుషుఁడు తన సూక్ష్మబుద్ధిచేఁ దెలిసికొనెను. తోడనే తన సేవకునకు ఒక పనిఁగల్పించి వాని నొక వైపునకంపి విజయ సింహుని లేఖాపఠనమైనపిమ్మట తిన్నగా నాతని సమీపించెను. ఆపురుషుని జూచినతోడనే విజయసింహుఁడు తటాలునలేచి వినయమువోఁప నెదురేగి నమస్కరించెను. పురుషుఁడు "కుమారా! దీర్ఘాయుష్మంతుడవై విజయుండవగు!!" మని దీవించుచు "తండ్రీ! రమ్ము చల్లనిగాలి వీచుచున్న యీరసాలపాదపముల చెంతఁ గూరుచుందము" అని పల్కెను. అంత వారిద్దఱుఁ నెల మావిగున్నలక్రిందనున్న చలువఱాతితిన్నెలపై నాసీనులైరి.

విక్రమసింహుఁడు :—కుమారా! ఉద్యానవనమున నొంటిగా నుంటివేమి?

విజ:—నాయనా! నాతోనున్న సేవకుని పుస్తకమును దెమ్మని మందిరమునకంపితిని.

విక్ర:—విజయసింహా! యేమియో యోఁజించుచున్న ట్లున్నది.

విజ:—ఏమియు లేదు.

విక్ర:—ఎచ్చటనుండియైన నేమైన సమాచారములు వచ్చినవా?

విజ:—(తొట్రుపడుచు) ఏమియు లేదు.

విక్ర—(ఇంచుక యోఁజించి) కుమారా, మీయమ్మ నీకుఁ బెండ్లి చేయవలయునని తొందరపడుచున్నది.

విజయసింహుఁడు తెల్లబోయెను. విక్రమసింహుఁడు నవ్వుచు-

"నీవు కోరిన కన్నియనే తెచ్చి పరిణయ మొనర్పవలయు· ననియే మాయభిప్రాయము" అనెను.

విజయసింహునిప్రాణములు కుదుటఁబడినవి. అతనికి తనతండ్రి సరళస్వభావము గలవాఁడనియు దయామయుండనియు బంధుప్రియుండనియు విరోధులయెడనేని సామభేదములఁ జూపి తనకులోఁబఱచుకొని సఖ్యము నెఱపు స్వభావము గల వాఁడనియు పరేఙ్గితజ్ఞుఁడనియు విశేషించి తనముద్దు చెల్లించు నంతటిప్రేమ గలవాఁడనియు యెఱుంగును. తండ్రియు తాను గలిసి యీకార్యమునకుఁబూనినసే యుందు విజయమును బొందుట సులభమని యాతఁడు యోజించుకొనియెను. అంతట తనతండ్రితో నీవిధముగాఁ బ్రసంగించెను.

నాయనా? వర్ధమానపురపు వారికిని మనకును సంబంధములు గలవా?

విక్ర:—కలవు.

విజ:—ఇపుడీ రెండు రాజ్యములకుఁ గల్గిన విరోధముల వలన నా సంబంధములు దీరినట్లేనా !?

విక్ర:—అట్లెందులకుఁ గావలయును? మన రెండు కుటుంబములలో సంతానము గలిగియుండగా నవితీరినవని తలంచుటెట్లు ? ఆ సుదర్శనునకు ఒక పుత్రరత్నమును కుమారికామణియుఁ గలరు.

విజ:—ఆకన్యకను బలవంతముగా నామెతండ్రి కొండవీటి ప్రభువగు నారాయణగజపతి కీచ్చునఁట!!

విక్ర:—ఏమీ!! బలవంత వివాహమా? ఆమె యొప్పుకొనలేదా ?

విజ:—లేదట.

విక్ర:—అటులైన ఆమె ఏమిసేయును?

విజ:—ప్రాణత్యాగముఁ జేసికొనను న్నది.

విక్ర:—అయ్యో! అటులనా? ఆమె మఱెవ్వరినైనా వరించి యున్నదా ఏమి?

విజయసింహుఁడు తలవంచి యూరకుండెను. విక్రమసింహున కంతయు బోధపడినది.

విక్ర:—కుమారా! దాపరికము సేయకుము. త్వరగా నా కన్యకామణినిఁ గాపాడుట మంచిది. నాయెడల భయమందక యున్న సమాచారమును చెప్పుము.

విజయసింహుఁడు తనయొద్దనున్న జాబునుదీసి తండ్రిచేతి కొసంగెను. అతఁ డాజాబును సాంతముగ జదివి సంతసముతో

విక్ర:—తండ్రీ ఈ కన్యకామణి మనపాలిటి భాగ్య దేవత! ఈమె తప్పక నీ కర్ధాఙ్గికాఁదగినది. ఇఁక సుదర్శ నునకు బుద్ధివచ్చునట్లొనర్చి యామెను గైకొనఁదగును.

విజ:—నాయనా! సుదర్శనుఁడు మనపై నకారణ మగు విరోధముఁబూనియుండెఁగదా! అతని తనయను గజపతి కియ్యదలంచియుండ మన మీ కార్యమున కుద్యమింప మరల దేశమున యుద్ధములకు కారణమగును గదా!

విక్ర:—కానిమ్ము! ఊరకే 'చెఱుకా, పానకమి'మ్మన్న నిచ్చునా? తగు చికిత్సచేయవలదా? మొదటినుండియు సుదర్శ నుఁడు కఠుమూర్ఖుఁడు. హితాహితముల నరయనేరని యవి వేకి!! ఎవ్వరో దుష్టుల దుర్బోధనల విని నాపై లేనిపోని విరో ధముఁ బూనియున్నాఁడు. బంధుగులతో పగబెట్టుకొనుట తగ దని హితముఁజెప్పిన తన కుమారుఁడగు నశోకుని దేశమునుండి వెడలఁగొట్టించెను.

విజ:—ఔనట!! పాప మాతఁ డెయ్యెడనుండెనో!!

విక్ర:—మన మెట్లు చెప్పఁగలము? ఆ కుమారుఁడు మహామేధానిధి. అసాధారణ ప్రతాపశాలి. కరము సత్ప్రవర్తనుఁడు. వాని మేనమఱదలగు వాసంతిక యనునామెయు సుదర్శనునియొద్ద గలదు. ఆకన్నియ నాతనికిచ్చి పరిణయ మొనర్పవలయునని సుదర్శనుని యుద్దేశ్యము.

విజ:—అది సమంజసముగనేయున్నది. ఆవాసంతిక

మహాశేముషీమణి ఈ కార్యములపట్ల నామె సాయము మంచిదని తోఁచుచున్నది. ఆ యరవిందావాసంతికలకు శరీరములు వేరైనను, ప్రాణము లొక్కటియే యని చెప్పఁగొందురు

విక్ర:—ఔనట.

విజ:—పాప మా యశోకుఁ డిప్పుడెచ్చోటనుండెనో గదా?! సుగుణనిధి గావున తండ్రిమాట కెదు రాడరాదని, దేశములఁబట్టి పోయెను.

విక్ర:—అట్లెన్నటికినిఁ బోనఁడు. తండ్రి తన పోబడి యెఱింగిన దండించునని ప్రచ్ఛన్నముగా నా ప్రాంతములనే యుండి యంతయుఁ గనుగొనుచునే యుండును.

విజ:—నారాయణగజపతి కా కన్యనిచ్చుట యాతని కిష్టముగా నుండునా?

విక్ర:—అట్లుండదు! నా ముద్దుచెల్లించు మా యన్న దేశములపాలయ్యెనని, తన విచారమును సూచించుచు నా యరవింద వ్రాసియున్నదిగదా!! ఇఁక యోచింపరాదు. శ్రీ కృష్ణదేవ మహారాయలచేతి దెబ్బలుదిని చాలకాలమువఱకు దుండగములు దలపెట్టకుండిన యీ దుష్టరాజలోకమున మరల తలయెత్తువారిలో నీ గజపతి మొదటివాఁడు. కోడనే, మనము వీనినుపదమడంచిన తక్కుంగల దుర్మార్గులకు బుద్ధివచ్చును. ఈ విధముగా మరల నీదేశమున నెమ్మదిగల్గును. కాన నిఁక కన్యకా రక్షణమునకై ప్రయత్నింతము.

ఈ విధముగా మాటలాడుకొనుచు నాతండ్రి కుమారులు రాజభవనమునుగూర్చి వెడలిపోయిరి.

# పదియవ ప్రకరణము

## కొండశక్తి—వైద్యుఁడు

శ్రీశైలపర్వతముపైనున్న పెద్దపేటుపై వెలసిన దుర్గా గుహాసమీపమున వర్ధమానపురాధీశుఁడగు సుదర్శనుఁడు వారమురోజులనుండి పటకుటీరములు వేయించి కుటుంబపరివారయుతుఁడై వసించుచుండెను. ఆ గుహాయందొక సిద్ధుఁడు తప మాచరించుచుండెను. ఆదేవతతో నాసిద్ధుఁడు గూడ ఆపేటుపై వెలసెనని యచ్చటివారి తలంపు. నిత్యము సుదర్శనుఁ డాసిద్ధునకు నమస్కరించి ధూపదీపనైవేద్యాదు లటనుంచిన నాతఁ డందఱిని యావలకుఁ బంపి యవిదేవికి నివేదనఁ జేయుచుండును. మిగిలిన ప్రసాదము వారి కందఱి కొసంగి ధన్యులఁ జేయును. అతఁడు పూజానంతరము దాసీదాసజనంబుల నవ్వలికిఁ బంపి వాసంతికాద్వితీయయగు నరవిందను తనగుహాలోఁ గూరుచుండఁ బెట్టుకొని మంత్రించి తీర్థ మొసఁగుచుండెను. మఱియు నాతఁడు చేయిఁజూచి యామె కౌషధమును గూడ నొసఁగుచుండెను. అతఁ డెవ్వరితోడను మాటలాడఁడు. అరవిందావాసంతికలనుమాత్రము తనగుహాలోనికి రానిచ్చుచుండెను. అతని వయస్సిరువది సంవత్సరములకు మించి యుండలేదు. అతఁడు చాల చక్కనివాఁడు. దేహము పుటముబెట్టిన బంగారమువంటి చాయ గలది. పురుషుల కుండఁదగు మంచి యున్నతియు, ఎగుభుజంబులును పొడవుపాటిచేతులును సన్నని నడుమును

విశాలమగు వక్షమును గల యాతఁడు రూపుదాల్చిన మన్మథునివలెఁ దోఁచుచుండెను. అతఁడు కాషాయవస్త్రముగల యంగరకా దొడఁగికొని వెడదలగు జడలు మడిమలవఱకు వ్రేలాడ మెడలో రుద్రాక్షపేరులువెలయ నొంటినిండ విభూతి నలఁదికొని దండకమండలములు చేత నమర సాక్షాచ్ఛంకరునివలె నాగుహాయందు గూరుచుండి జపము చేసికొనుచుండెను. చాలసేపు మన యరవిందావాసంతికల తనయొద్దఁ గూరుచుండఁబెట్టుకొని మంచిమంచి నీతులు ధర్మములు పురాణేతిహాసములఁ జెప్పుచుండుటగలదు. అతఁడొక్కొక్కతఱి గనుపింపకుండినపుడు, ఆ మహానుభావుఁ డదృశ్యుఁ డయ్యెనని సుదర్శనుఁడు దలంచుచుండెను.

కొలఁదిరోజుల కరవిందకు దేహ మించుక నెమ్మది గల్గెను. ఆమె యించుకించుక ఆహారమును భుజించుచు నారోగ్యమును బొందుచుండెను. ఆమె కించుక బలమువచ్చి నడువ నోపిక కల్గినదిమొదలు ఆ పర్వతముపైనున్న పెద్దపెద్ద వనములును, అచ్చట నెత్తగు మిట్టపైనుండి పడుచున్న ధారాపాతములును, ఆయున్నత శైలోపరిభాగమున వెండి బంగారు నవరత్నములవలె మెఱయుచు కన్నులకు మిరుమిట్లు గొల్పు గైరికాది ధాతువులును మఱియు నచ్చట దివ్యతపోధనులునిశ్చింతగా గూరుచుండి తప మాచరించుకొని కృతార్థులగుటకై దైవముచే నిర్మింపఁబడిన పెద్దపెద్ద గుహలును వేయేల భగవంతుని సృష్టినైసర్గికరామణీయకమంతయు నచ్చటనే చేర్చియుంచెనో యన నొప్పు నా శైలరాజమునఁ

గల విచిత్రములఁ జూచుచు, అరవిందావాసంతికలు మితిలేని యానందమును బొందుచుండెడివారు. వా రిద్ద ఱొకనాఁటి సాయంకాలమున నాకొండపైనున్న యొక శిలాతలమున రసాలవృక్షమునీడ నాసీనలై యీవిధముగా ముచ్చటించు కొనుచుండిరి.

అరవింద:—ప్రియసఖీ వాసంతికా, మన మిచ్చటికి వచ్చి యించుమిం చిరువదిరోజు లగుచున్నది గదా! కల్యాణపుర సమాచారము లేమియుఁ దెలియలేదేమి?

వాసంతిక—అరవిందా, వారు తమ సన్నాహములతో రేపట మాపట వత్తురు.

అ:—నామూలమున వారికి గజపతులతోటి వైరము సంభవించునని యేమైనఁ దలంతువేమో!

వా:—అట్లు సంశయింపకుము. దురాత్ముఁడగు గజపతి కేవిధముననైన మనమునందు నావిక్రమసింహుఁడు దలఁచుచుండెననియు, ఇపు డీనెపమున వానిని జయించి మీ తండ్రిని లోఁబఱుచుకొనఁగల్గుట మంచి త్రోవయనియు వారిందులకుఁ దగు సన్నాహము లొనర్చుచుండిరని మీ యన్నగారు నిన్న జెప్పలేదా!!

అ:—ఇపుడు నేను గనుపింపకుండఁ బోయినచో మా తండ్రి మీపై ననుమానించు నేమోగదా.

వా:—మీ కన్న ముందే మేము వెడలిపోవలయును.

అ:—సఖీ! యీ తాపసునియొద్ద నీ పర్వత గుహాల

యందు యోగరహస్యముల నభ్యసించుచు. నీవును యోగిని వయ్యెదవా?

వాసంతిక చిఱునవ్వున మోమువంచెను. అరవింద యామె చేయిఁబట్టుకొని 'వదినే, నీ దేవతావేశము నా యాపదఁ గడపుటకు మూలమైనను ముందు మీకు మాత్రమ భీష్టసిద్ధియైనది.' యనెను

వా:—అరవిందా, యేమైనదే.

అ:—తాపసునితోడి సాంగత్యము.

వా:—చాలునులే, యూరకుండుము!! అరవిందా, నీ యొడలికి మంచి యారోగ్యము గల్గినదిగదా ?

అ:—మీ దయవలన నా కారోగ్యము గల్గినది. ఇఁక నా ప్రాణసమానవగు నిన్నాయనకు పారితోషికముగా నొసంగెద.

వారీవిధమున మాటలాడుచుండగా దూరమునుండి యోగివచ్చుచుండెను. అరవిందావాసంతికలెదురేగి తోడి తెచ్చిరి. అంత నాతఁడొక శిలాఫలకముపైఁ గూరుచుండెను. తాపసుఁ డిట్టునట్టుఁ జూచి యెవ్వరు లేకుండుటఁ గని నవ్వుచు వాసంతికవైపు జూచి కూరుచుండుమనెను. వాసంతిక తలవంచి యించుక దూరమునఁ గూరుచుండెను.

అరవింద:—అన్నా నీవు నాయొడలు నెమ్మది పఱచి నందులకు నీకు మంచి పారితోషిక మిమ్మని యామె నన్ను త్వర పెట్టుచున్నది.

యోగి:—అమ్మా, యే మిచ్చెదవు.

అరవిం:—(వాసంతిక చేయిఁబట్టి) అన్నయ్యా, యిదిగో, నా ప్రాణప్రదమగు వస్తువు. దీనిని నీకు బహుమాన పూర్వకముగా నిచ్చెద.

వాసంతిక (నవ్వుచు) పెండ్లిగాకముందే మగనికి ప్రణయలేఖలు బంపిన జాణలు మీరు పారితోషికము లొసంగఁజాలరా?

అరవింద తలవంచుకొనెను.

యోగి (నవ్వుచు) ఔనౌను. దేవతావేశముల నటించి హైనముల నాగించి వచ్చి మగనియొద్దఁ గూరుచుండి మంత్రనములాడు మీరు జాణలుకారు గాఁబోలు!!

వాసంతిక నిరుత్తర యయ్యెను.

అ:—అన్నా రాజ్యాంగవిషయముల నతి సూక్ష్మ బుద్ధిచే గ్రహించి యందులకుఁ దగు ప్రతిక్రియ లాలోచించుటయందీమెయొక్క యసాధారణ శేముషీవిభవమున కచ్చెరు వగుచున్నది.

యోగి:—అవును. ఈమె ముందుముందు నాకు ముఖ్యమంత్రియై వర్ధమానపుర రాజ్యము నుద్ధరింపఁగలదు.

అరవిం:—సోదరా, కల్యాణపుర సమాచారములేమి?

యోగి:—సోదరీ, వారు త్వరలో వచ్చి నిన్నుఁ గొని పోవనున్నారు.

అర:—ఐన మీ రేవిధముగాఁ దప్పించుకొనిపోయెదరు?

యో:—(వాసంతికవైపు జూచెను)

వాస:—ఇప్పుడు నేనుగానీ మీ యన్నగారుగానీ మామకును గజపతిసంబంధులకును గనుపింపరాదు. సమయానుగుణములగు ప్రచ్ఛన్నవేషములతో సంచరించుచు కార్యములను సాధింపవలయును.

యోగి:—అవును. ఇదియే యుపాయము.

అరవిం:—అయిన, మనము మరల గలసికొనుట యెప్పుడు?

వాస:—మన కార్యములన్నియు ఫలించినయవ్వల.

వారిట్లు మాటలాడుచుండగా ఆవెనుక చెట్టుక్రింద, ఎండి రాలిపడియున్న ఆకులలో మనుజుల యడుగుల చప్పుడయ్యెను. వారా చప్పుడుల నాలించి లేచి నాల్గువైపుల వెదకిరి. ఎవ్వరును గనుపించలేదు. అప్పుడప్పుడే ప్రొద్దుగ్రుంకుచుండెను. ఇక నిటనుండి మఱుగుపఱచుకొనుట భద్రముగాదని రాత్రి దేవీదర్శనమునకై యా మువ్వురును గుహాభిముఖులై వెడలిపోయిరి.

———

# పదకొండవ ప్రకరణము

## రాత్రి—కన్యకాపహరణము

రాత్రి రెండుజాములయ్యెను. ప్రపంచమంతయు నంధకారబంధురమై నిశాకాంత వికారముగా నంగవిన్యాసమొనర్చుచు నల్లని వసనముధరించి తన నీలకేశపాశముల విరియఁబోసికొని మందహాసమొనర్చుచు జగంబున నిరంకుశముగా సంచరించుచుండెను. ఆమె భయంకరాకృతిఁ జూడనోడి జగంబునఁగల జీవులందఱు చైతన్యములఁ దప్పి యొచ్చోటివా రచ్చట నిద్రనెపమున కన్నులుమూసికొని పడియుండిరి. ఆ భయంకర నిశీథినింజూచి పశుపక్ష్యాదులు నయినను కనులు మూసికొని, భగవంతుడా! యీభయానక దృశ్యమును బాపి మరల మాకు వెలుఁగు ననుగ్రహింపుమని ధ్యానించుచుండెను. ఆ సమయమున జారచోరులును కామాంధకార నిమగ్నులు దప్ప చైతన్యముగలిగి ఆ యంధకారమును జూచునా రెవ్వరును లేరు. అప్పుడాచీకటి రాత్రియందు శ్రీశైలారణ్యముఁ జూడ మిక్కిలిభయముగొల్పుచుండెను. ఆ పర్వతమునందున్న దట్టమగు తరుశాఖలొండొంటి నొరసికొనుచు రివ్వురివ్వుమని వీచు గాలిచేఁ గదలు నానాపువ్వుల శబ్దమునకు గుండెలు బ్రద్దలగుచుండెను. మఱియు నాతరువుల నుండి గ్రాలు పండుటాకుల మర్మరధ్వనులును, చెట్లకొమ్మలకు గఱచికొని చెవులు గింగురుమనున ట్లొక్కతీరుననే కూయు కీచురాళ్ల శబ్దంబులును, ఆహారములను వెదకికొనుచు రాత్రి

యగుటచే నిర్భయముగా సంచరించు ఘాతుకమృగంబుల భయంకర గర్జనములును, ఎత్తగు పేట్లపైనుండి పల్లములకుఁ బడుచున్న సెలయేళ్ల గలగలధ్వనులును కన్నులమూసినను తెఱచికొన్నను, ఒక్కటేవిధమగు నంధకారము దక్క మఱియొకటి గానుపింపని యాశైలారణ్యములంజూచి యాయంధకారమున బ్రదుక నెవ్వరితరము!!

కొండపేటుపై దేవీగుహాయొద్ద వేసియుండు సువర్ణసుని గుడారములలో నచ్చటచ్చట దీపములు వెలుఁగుచుండెను. ఆ పటకుటీరములలోని వారందఱు గాఢనిద్రాపరవశులైయుండిరి. అచ్చట గస్తుదిరుగువారు మాత్రము తిరుగుచుండిరి. కొంతసేపటికి వారును నిద్రాదేవికి వశులై యెచ్చటివా రచ్చటఁ బడిపోయిరి. అరవిందావాసంతికలొక పటకుటీరమున వేఱువేఱు పర్యంకములపైఁ బఱుండి నిదురించుచుండిరి. వైద్యుఁడు దేవీగుహాయందు శయనించెను. సువర్ణసుఁడును సుశీలయుఁ దక్కినవారును వారివారి పటకుటీరముల శయనించి నిదురించుచుండిరి. అప్పుడు నిదురించుచున్న వాసంతికకు క్రిందివిధమగు స్వప్నముగల్గెను.

అరవిందయు తానును, ఒకకొండపై గూరుచుండి యచ్చట రామణీయకములఁ జూచుచున్నట్లును, అచ్చట చరియలోనుండి యొకరాక్షసుఁడు కొండపై కెక్కి తమ యొద్దకు వచ్చుచున్నట్లును, తామిద్దఱు భయపడి పరువెత్తుచుండ నా భయంకరరాక్షసుఁ డరవిందను సమీపించి యామె నెత్తుకొని యాచరియలోనికిఁ బోవుచున్నట్లును,

అప్పు డరవింద భీతయై, "అయ్యో, రాక్షసుఁడు నన్నెత్తి కొని పోవుచున్నాఁడు. రక్షింపుము! రక్షింపు"డని యెలుగెత్తి యఱచుచున్నట్లును. తోడనే యామెకు మెలకువగల్గెను. లేచి శయ్యపైఁ గూరుచుండి నాల్గువైపులఁ జూచెను. అచ్చటి దీపము లాఱిపోయినవి. ఆమె కనుమానముకల్గెను. "అర విందా? అరవిందా"యని పిలిచెను. ఆమె పలుకలేదు. ఆమె యనుమానము మఱింత వృద్ధియయ్యెను. తోడనే లేచి యర విందు మంచమునొద్ద కేగి యామె పడుకఁ దడవిచూచెను. ఆమె యగపడలేదు. దీపము వెలిఁగించి నాల్గువైపుల పరిశీలించెను. ఎచ్చటను అగపడలేదు. ఆమె మంచముక్రింద పెద్దసొరం గము త్రవ్వఁబడియుండెను.

వాసంతిక తనదుస్స్వప్న మిప్పుడే ఫలించినదని తలంచి 'అయ్యో, అరవిందా' యెచ్చటి కేగితివి. నిన్నెవరో దుర్మార్గు లపహరించి యుందురు. ఎవ్వరో యైయుండరు. దురాత్ముఁ డగు నారాయణగజపతియే యీ భయంకరకార్య మొనర్చి యుండును. హా, సఖీ! నా మేనఁ బ్రాణములుండ నిన్నా నీచుఁడు కన్నెత్తి చూడఁజాలఁడని నీకుఁ జెప్పితినిగదా. ఆ ప్రతిజ్ఞ కర్థమున్నదా. అయ్యో 'యెంతలో నెంతపని జరిగి పోయినది' యని యామె దుఃఖించెను. ఆమె మరల ధైర్యము దెచ్చుకొని, చేతనున్న దీప మటునుంచి యెవ్వరు మెలకువఁ గొనకుండ యోగియున్న గుహాలోనికరిగెను. అచ్చట పరుండి నిదురపట్టక యేమేమియో యోచించుకొనుచున్న యోగి

యామెనుజూచి 'యెవరు వారు' అని ప్రశ్నించెను. వాసంతిక నెమ్మదిగా 'నేను' అనెను.

యోగి:—వాసంతికా, యిపు డిచ్చటికేల వచ్చితివి?

వాసం:—(అతని సమీపించి నెమ్మదిగా) మన యరవిందను చోరు లపహరించిరి!!

యోగి:—హా, యేమి విపరీతము!!

వాసం:—ఈ విషయము గోప్యముగా నుంచదగును.

యోగి:—ఇప్పు డామె నే దురాత్ము డపహరించి యుండును?

వాసం:—ఎవ్వరున్నారు. గజపతియే యీదుష్కార్య మొనర్చినవాడు.

యోగి:—అదియెట్లు నిర్ధారణ జేయగలము?

వాసం:—సందేహ మేమున్నది. నేడు సాయంతనము కొండపై గూరుచుండి మనము మువ్వురము మాటలాడుకొనుచుండగా చెట్లక్రింది యాకులలో మనుజుల చప్పుడయ్యెగదా. వారు వానిచే బంపబడిన గూఢచారులై యుందురు. వా రిచ్చటి సమాచారములన్నియు గనిపెట్టి యదనువేచి ఆమె నపహరించిరి.

యోగి: మనమిపు డేమిచేయవలయును?

వాసం: నే నిదిమొదలు ప్రచ్ఛన్నవేషమున కొండవీటికేగి యామె కా దురాత్ముడేమియు నెగ్గొనర్పకుండ నరసికొనుచుండెద. మీరు కల్యాణపురమున కేగి వారి కీ

సమాచారము నెఱిగించి అచ్చటినుండి యామెనుఁ దప్పించు నుపాయ మరయుడు.

యోగి:—ప్రేయసీ, అరవింద పోకడవిని మా జనని జీవించునా.

ఎ°సం:—అందులకే చింతింపవలసియున్నది.

అంత వారిద్దఱా యంధకారమున నాభయంకర శైలారణ్యములలోఁబడి యెచ్చటికోపోయిరి.

# పండ్రెండవ ప్రకరణము

## ఐకమత్యము లేని కుటుంబమున కన్నియు నష్టములే.

ఐకమత్యములేని కుటుంబమున కన్నియు నష్టములే. ఐకమత్యమనునది కుటుంబమునకు దఱుగని పెన్నిధివంటిది. పలువు రున్న కుటుంబమున నొకనికి నఖండమగు యశము వచ్చినఁ దక్కుఁగలవా రసూయఁజెందక వానియెడలఁ బ్రేమఁ జూపుటయే యైకమత్యము. ఒకనికి ఆపదగాని యవమానము గాని సంభవించిన నది తమకుఁ గల్గినటులే తలంచి దానిం బాపి వానిని గాపాడుటయే యైకమత్యము. ఒకనికి సంపదగల్గిన నది తమకు గల్గినదనియే తలంచి సంతసించుచు నా సంపదలు తా మందఱనుభవించుటయే యైకమత్యము. చతుష్పాత్తులగు పశువులుగూడ నొక్కమందలో నొక్కటిగా మేసి యొక కాలువనీరు త్రాగి యొక్క తావుననే పరుండి యొకదానికొకటి ప్రేమసూచకముగా నాకుకొనుచు దుష్టపశు వేదైన తమ మందలో నొకదానినిఁ బొడువవచ్చిన తక్కినవన్నియుఁ గలిసి దానిం దఱిమి యన్యోన్యమైత్రి సుఖముగా నుండుట యైక మత్యమే గదా. కేవల మజ్ఞాన చేతనములగు పక్షులుగూడ వేకువన లేచి తమజాతిపక్షులన్నియు నొకదానినొకటి బిలుచు కొని గుంపుగట్టి యుత్సాహమున నెంతదూరమునకైన నేగి యాహారము సేకరించుకొని ప్రొద్దుగ్రుంకునరికి నిరపాయ ముగా తమ కులాయములంచేరుట ఐకమత్య ప్రభావముననే గదా. సాధారణముగాఁ బసిపిలలతో నాటలాడుకొనుచు

క్రీడామృగములనంబసు లేళ్లు దుప్పులుగూడ, ఐకమత్యమున గుంపుగట్టి యెదుటం బడినచో వానిని త్రిశూలపాణియగు పినాకియేనియుం దఱుమంజాలఁడు. అట్టియెడ జనుల కైకమత్యమున్నయెడల నెంతటి కార్యములనైన సాధింపవచ్చును. రాజ్యముల శాసింపవచ్చును. కొండలు పిండిజేయవచ్చును. అట్టి యైకమత్యము లేనివారి కథోగతియే.

సుదర్శనుని కుటుంబమున నట్టి యైకమత్య భాగ్యము తక్కువై యుండెను. అన్నియువాని యవివేకముననే!! కొడుకు దేశాంతర గతుఁడగుట, భార్య దుఃఖమగ్నమానసయగుట, కూతు రనారోగ్యమున నాపసిలపాలగుట, దగ్గఱనున్న బంధుగులగు కల్యాణపురవువారు ప్రబలశత్రువులగుట, యిట్టి యనర్థములన్నియు నైకమత్యము నశించుటవలననే.

నాఁడు వేకువయయ్యెను. అందఱులేచి యెవరికార్యములు వారు జరుపఁబోయిరి. దాసీజనము లరవిందా వాసంతికల పటకుటీరములకుఁ బోయి యట వారిం గానరైరి. తోడనే వారు భయమందుచు వచ్చి సుశీల కెఱింగించిరి. అవ్వల ఆమె అరవిందా వాసంతికల పట కుటీరముల కేగి వారు యగపడనందుకు విలపించుచుండెను. అరవిందా వాసంతికలు గనుపింపలేదని తెలిసినతోడనే యా పటకుటీరములలో గందరగోళము బయలుదేఱెను. కొందఱు చారులు వారి పోఁబడి నరయ నలుదిక్కులకుఁ బరుగెత్తిరి. సుదర్శనుఁడేమియుం దోఁపక తనలోఁ దాను దుఃఖించుచు యోగిగుహ యొద్దకు వచ్చెను. అఁట యోగి కనుపింపలేదు. ఆతఁ డఁట

కొంతసేపు నిర్విణ్ణుడై యుండి దుఃఖితయగు తన ప్రేయసి నూరార్చి యీవిషయము దెల్ప నామెయొద్దకేగెను. సుదర్శనుఁడు వచ్చుసరి కామె తన తనయకు గల్గిన యాపదకై వగచుచుండెను. సుదర్శనుఁడు నెమ్మదిగా నామెయొద్దకేగి కూరుచుండి "దేవీ, యూరక చింతింపకుము. మన పట్టికి దోసగు రాకుండఁ గాపాడ మహనీయుండగు పరమేశ్వరుండు బూనియున్నాఁడు" అనెను.

సుశీల (కన్నీరు దుడిచికొనుచు) అది యెట్లు.

సు:—ఆమెను వెదకి తేఁ బ్రయత్నింతు.

సుశీల:—అయిన మనమిపుడేమి జేయుదము?

సు:—దేవీ, తగు ప్రయత్నము లొనర్తము.

అనితన పరివారమున కానాఁడే వర్ధమానపురమునకు పయనమగుటకు నాజ్ఞాపించెను. వారును నిరుత్సాహయుతము లగు మనములతో సుదర్శనుని యాజ్ఞచొప్పున పయనము గావించిరి. సుశీలతో నంతఃపుర పరిచారికలును వర్ణింప నలవి గాని దుఃఖముతో, ఐకమత్యములేని కుటుంబమున కన్నియు కష్టములేగదా యని సుదర్శనుని తమలోఁ దాము నిందించు కొనుచుఁ బోయిరి.

# పదమూడవ ప్రకరణము

## "పిచ్చిది—పిచ్చిది."

కొండవీటి దుర్గమున నారాయణగజపతి యంతః పురోద్యాన సౌధమున నొక బాలికామణి యేకతంబ కూరుచుండి తనలో తా నేమేమియో యోజించుకొనుచుండెను. ఆమె ముద్దుమోము సంపూర్ణ పూర్ణిమాచంద్రప్రతిభాస మానమైనను ఏకారణముననో యించుక యెఱ్ఱబాఱి యుండెను. ఆమె యాకర్ణాంతవిశాలధవళనేత్రములు గూడ నెఱ్ఱబడియుండెను. అధర విద్రుమము చలించుచుండెను. మాటిమాటికి నిడుదయూర్పులు విడుచుచుండెను. ఆ యువతి మిక్కుటమగు హృదయావేగమున మాటిమాటికి అటునిటుఁ జూచుచు మరల తన సోఫాపైన నాసీనయగుచు తనలో తా నేమేమో యోచించుకొనుచుండెను.

"హా! ఇపుడు నేఁ జేయఁదగిన దేమి. సాహసించి యిపుడీ దుష్ట మహిషాసురుని నా కరవాలమున కేరఁ జేసి భయంకరకాళికామూర్తి నగుదునా? లేక యీ క్రూరరావణనిశాచరుని సకుటుంబముగా నాశన మొనర్ప శ్రీరామచంద్రుఁడు సబలుఁడై వచ్చునందాక ఓర్పుబూని సీతా మహాదేవి యగుదునా? ఈ మూర్ఖుఁడు తన వైభవములు తన పురమునందలి వినోదములు చూపి నన్ను తనవశ మొనర్చుకొనఁ జూచుచున్నాఁడు. కాని, సమీపించినపుడు తన ప్రాణములు తీయుటకు మృత్యుదేవతనగుదునని యెఱుఁగడు.

కానిమ్ము మఱికొన్ని రోజు లిటులే మౌనమువహించియుండెద. ఈ లోపుఁగా వారువచ్చి తగు ప్రతీకార మొనర్పఁగలరు. ఒక వేళ నింతలో నీదురాత్ముఁడు బలాత్కరింపఁ బూనినచో అపుడే నా బాహుబలము చవిచూపి వీనిమద మడంచెద." ఇట్లు యోజించుకొనుచు నా సోఫాపై అర్ధశాయినియై చెక్కిన చేయిఁజేర్చుకొని యుండెను.

సాయంకాలము నాలుగుఘంట లయినది. అప్పుడు తత్పట్టణాధీశుఁడగు నారాయణగజపతి సర్వాలంకార భూషితుఁడై యొక సేవకునితో నా మందిరమునకు వచ్చు చుండెను. వానిజాడ యెఱింగి యా బాలిక పైకుబికివచ్చు తన క్రోధ మడంచుకొని శిరఃకంపన మొనర్చి తటాలునలేచి యొక ప్రక్కగా నిలువఁబడెను. గజపతి తన సేవకునికిఁ బోవ సెలవొసంగి తాను లోపలఁ బ్రవేశించి యందొక కుర్చీపై నాసీనుఁడయ్యెను. వాని కాబాలికతో ముందేమి విధముగా సంభాషింపవలయునో యెఱుకపడలేదు. కొంతవడి యట్లే మౌనమునుండి యామెతో నీవిధముగాఁ బ్రసంగించెను.

'సుందరీ, నీదేహ మారోగ్యముగనున్నదా?'

సుందరి ప్రత్యుత్తర మియ్యలేదు.

గజపతి:—నా పరిజను లేకొఱంతయుఁ గలుగనీక నిన్ను సేవించుచున్నారు గదా?

(జవాబులేదు.)

గజ: కాంతాశిరోమణీ, వికసించిన నవారవిందము

నొప్పలిన నీ ముఖారవిందముం జూపి నాకు నయనానందం బొనర్పుము.

ఆమె యటులే తలవంచి నేలవంకఁజూచుచు నిలువఁ బడియుండెను.

గజపతి:—కామినీ, నాపై కోపమా? ముందుముందీ కళింగదేశమున కంతెయు చక్రవర్తినివి కాఁబోయెదవుగదా! సకల దేశాధీశుల సతులు నీపాదపీఠముకడ మ్రొక్కులు వేయ నఖండవైభవమున వఱలబోయెదవు. ఇఁక దయయుంచి నాపై అనుగ్రహసూచకమగు నొక్క వీక్షణము బఱపుము.

ఆమెకుఁ గోపమువచ్చెను. కన్ను లగ్నిస్ఫులింగములు వర్షింపసాగెను. వానింజూచి తీవ్రస్వరమున—

'నీ వైభవములంజూచి భ్రమసిపోవుటకు మేమేమి ఘోరదరిద్రులమని తలంచితివా?' యనెను.

గజపతి కామె తిరస్కారభావమునకు ఆశ్చర్యము దోఁచి—

'భామినీ! అందులకుఁగాదు. చక్రవర్తినీపదవి అందఱు సుందరులకు లభించునా?' యనెను.

బాలిక:—నీవు చక్రవర్తివి గాఁబోయెదవా?

గజపతి:—కాక మఱేమి!!

బాలిక:—ఇట్టి దురాత్మునికి చక్రవర్తిపదవి నొసంగి దైవము మన్నించునా?

గజపతి:—నేనేమి దోషమొనర్చితిని?

బాలిక:—నన్నపహరించి తెచ్చితివి.

గజపతి:—ఒకానొక కారణమున నట్లు తెచ్చితిని. మొదటినుండియు మీ తండ్రి నిన్ను నా కొసంగెదనని వాగ్దానము జేసియున్నాడు.

బాలిక:—ఆతఁడు నీకంటె మూర్ఖుఁడు. నీ వాతనికంటె పాపాత్ముఁడవు. కావుననే మీకు స్నేహము కుదిరినది. కొలఁదికాలమున మీ పాపములకుఁ దగు ఫలము లందబోయెదరు!!

గజపతి:—ఏమీ, నా యధికారమును, బలంబును పౌరుషంబును, ఎఱుంగక మాటలాడుచున్నావు.

బాలిక:—ఈ తాటియాకుల చప్పుళ్లకు కుందేళ్లు బెదరవు!!

గజపతి:—బేలా! అఖిలరాజన్యమౌళికిరీటమణి పాదపద్ముండగు గజపతి యౌన్నత్యమును నిరసించెదవా!!

బాలిక:—మందుఁడా! మదించి యాలానం బూడబెఱికికొని దేశములపైఁబడి బాధించుచుండు గజంబుపొగరు తీర్ప కుంభస్థలంబుఁ బగులనడచి యందలి ముత్యంబుల గ్రహించుటకు విజయాంచితమగు సింహమును భగవంతుఁడు సృష్టించియే యుండును.

గజపతి:—రమణీమణీ! యూరకే నన్నేలదూఱెదవు. పసిదానవుగాన మంచిచెడ్డ లరయనేరకున్నావు. ఇపుడు నిన్నేమియు త్వరపెట్టను. కొన్నినాళ్లవఱకు నీ మదియందు లాభనష్టములఁ జక్కఁగా యోజించుకొనుము. అవ్వల నన్ను నీవే స్వయముగా వరింతువు.

ఆమె మోము చిట్లించి యేమో యనబోవుచుండ నింతలో నొకగీత మీ క్రిందివిధముగావినవచ్చెను.

"రమ్యశుభమూర్తియైన శ్రీరామచంద్రు।
పాదపద్మములను మదిభక్తినిల్పి।
విడువ కేవేళ సేవగావింపఁదలచు।
తరుణి నిను దుష్ట రావణాసురుఁడు బల్మి।
సకల మోహాంధచిత్తుఁడై యపహరించె।
నైన నేమాయె నింక నీయాత్మవిభుఁడు।
సబలుఁడై వచ్చి శత్రుని సమరమందు।
గెలిచి నినుగూర్మి పాలింపఁగలఁడు సుమ్ము।
తల్లడిల్లకు నీమది ధరణిజాత॥"

ఆ పాడుచున్నది యొకపిచ్చిది. ఆమె నాలుగైదు రోజులనుండి యీ కొండవీటి దుర్గమునఁ దిరుగుచున్నది. పాప మాయుస్మంతురాలు వయసు పదునెనిమిది పందొమ్మిది సంవత్సరము లుండవచ్చును. కైన వైపరీత్యమున నిట్టి యెల బ్రాయముననే యున్మాదము తటస్థించినది. ఆమె చక్కని యీడువారి కుండఁదగు ఒడ్డుపొడవులు గలిగి దేహము బంగరు శలాకవంటి ఛాయలచే నొప్పుచుండునదైనను ఒడలు నిండ బూదియు మన్ను మసియు మెత్తుకొని యుండుటచే, చూచుట కసహ్యముగ నుండెను. ఆమె విశాల తరళనయనములు వికారముగాఁ ద్రిప్పుచు, తన విద్రుమాధరము కుంద సుందరములగు దంతపాళిచే గఱచుకొనుచు, కనుబొమ్మ లెగరవైచుచు, కనఁబడినవారితో నెల్ల విపరీతసంభాషణము

లోనర్చుచు, తిరుగుచుండెను. ఆమె నల్లని ప్రాత చింపివస్త్రముఁ గట్టుకొని తల విరియఁబోసికొని నల్లని తన ముంగురులు మోముపై వ్రేలాడ వెఱ్ఱివెఱ్ఱి పాటలు పాడుచుఁ దిరుగు చుండెను.

యువకులును పిల్లలును ఆమెను జుట్టుకొని యామె వెఱ్ఱి మాటలకు చేష్టలకు వినోదించుచుండిరి. కొందఱు కొంటెపిల్ల లామెపై రాళ్లురువ్వుచు, పిచ్చీ, వెఱ్ఱీ యని కేకలువేయు చుండిరి. వారిపై యామెకు మితిలేని కోపమువచ్చి యిదిగో కొట్టెద నిదిగో పట్టెదనని తఱుముచుండెను. తన్నెంత బాధించు బాలులనైనను చేఁజిక్కినచో నేమియుఁ జేయక వారి నునుపులేబుగ్గలపై చిన్న చిటికె యొకటినైచి మెల్లగ జాఱవిడుచుచుండును. వారా సంగతి నెఱింగి యామెను జూచిన భయమందక చుట్టుమూగి యల్లరిఁ జేయుచుండిరి. ఆమె వారి నెటులో తప్పించుకొని రాజోద్యానమునఁ జొచ్చి యందలి సౌధముపై తన వికారభావ విలసనంబులగుఁ జూపు లను బఱపుచు పై గీతమును బాడుకొనుచుండెను. ఆ కంఠ స్వరము లోకమోహన మైనది. ఆ గాన మాధుర్యమునకు మోడులు చివురులెత్తుచుండెను. కఠినంపు శిలలుగూడ కరగి పోవుచున్నవి. ఆమె యటులే పాడుచుండెను. సౌధముపై నున్న బాలిక కా పాట వినవచ్చెను. తోడనే యామెహృద యమున ననేక భావము లుదయించెను. ఆమె యామోహన గీతమునం దర్థమేమైన నున్నదనియో లేక ఆ కంఠరవ మాధు ర్యమునకో గాని యా బాలిక యా పాట వినవచ్చినదిక్కు

నకే మరలి యా గీతమునే యా సక్తితో వినుచుండెను.

గజపతి యామె బాలికయగుటచే పిచ్చిదానితో వినోదింప కుతూహలపడుచున్నదని తలంచెను. తోడనే యాతఁడు, "సుందరీ, ఆ యున్మత్త చాల బాగుగా పాడును. మంచి జవ్వనముననే వెఱ్ఱియెత్తినది. ఎవ్వరిని ఏమియుఁ జేయదు. నీకామెతో వినోదింప నిచ్ఛగలదేనియామెనిచ్చుటకిఁ బిలిపింతును" అనెను. బాలిక యేమి యోచించుకొనియెనో గానిసరియేయని తలయూపెను. ఆతఁ డామె కీ విధముగా నైనను ప్రియముఁగూర్చి యామె దయకు పాత్రుఁడు గావల యునని యున్నవాఁడు గాన నా పిచ్చిదానిని పరిచారికలచేఁ బిలువనంపెను. వారా పిచ్చిదానిని తోడి తెచ్చిరి. ఆమె లోపలికివచ్చి వెఱ్ఱివెఱ్ఱి చూపుల నాల్గువైపులఁ జూచుచు, పెద్ద పెద్ద రాగములు దీయుచు చేతులు ద్రిప్పుచు నాసౌధ మున నాల్గువైపులు పరిశీలించి చూచి చూచి యందొక యున్నతాసనముపై నాసీనయయ్యెను. అది చూచి యచ్చటి పరిచారికలు నవ్వసాగిరి. బాలికయు నాయున్మత్తం జూచిన తోడనే యేదియో జ్ఞప్తికివచ్చినట్లు తనమోమువికసింప నామె వైపే చూచుచుండెను. గజపతి ఈ యున్మత్తతీరుంగాంచి, నవ్వుచు:

'నీ వెవ్వరవు?' అని యడిగెను.

పిచ్చిది:—నేను చండికను.

గజపతి:—నీ యాకారమునకు పేరు తగియున్నది. నీ వెందులకిట్లు పిచ్చిదానివై తిరుగుచున్నావు?

పి:—నా జ్ఞానరత్న మపహరింపఁ బడుటచే పిచ్చిదాననై తిని!!

గ:—దాని నెవ్వారపహరించిరి?

ప:—అదుగో యా దురాత్ముఁడు. ఈ దారుణ వాయువు, ఆ యంధకారము, ఆ వృక్షములు, ఆ యాకాశము!! అయ్యో నారత్నము నవియన్నియు నపహరించినవి. నేఁ బోయి యా వాయువులను గబళించెద; వృక్షములను బెకలించెద; ఆ యాకాశమును మాయము జేసెద; ఇదిగో పోవుచున్నాను; ఒక దెబ్బతో నారత్నమును గ్రహించెద; పోవుచున్నాను పోవుచున్నాను,

ఇట్లని మెట్లదిగిపోవుచుండెను.

గజపతి (నవ్వుచు లేచి యాపెనాపి) "నీరత్నమును ఆవలఁ దీసికొనఁ ప్రయత్నింపుగాని మా సౌధమునుండి ఈ బాలికామణులకు వినోదములఁ జూపి యానందింపఁ జేయుచుంటివా? నీ రత్నము నీకు లభించునటు లొనర్చెద.

ప:—అయ్యో నే నెచ్చటనుండి గెలుతును. నామణి నెత్తికొనిపోయిన వాయువును గబళించి నాదిశేషుని దేవలయును. ఆ కాఱుచీకటులు మాయించుటకు సహస్రాంశుని గనుగొనవలయును. ఇఁక నా కెక్కడి వినోదములు!! నేఁ బోయెద.

బాలిక యీ యసందర్భప్రలాపంబుల కత్యాశ్చర్య మానసయై యాయున్మత్తు వంకనే చూచుచుండెను. గజపతి యాయున్మత్తు నచ్చటనే కొంతకాలము నిలిపినచో బాలిక మిక్కిలి యుత్సాహమున దనపై గల కోపమంతయు మఱచి ప్రసన్నయగునని తలంచి——

'పిచ్చిదానా! నీ రత్నమును వెదకి యిచ్చుభారము నాది. అందాక నీ వీ కన్యకారత్నముతో మా యంతఃపురమున నుండుము' అనెను.

పిచ్చిది బాలికవైపుజూచి "యిదియే నా రత్నము! అయ్యో రత్నమా—నిన్ను గానక వెఱ్ఱినై తిరుగుచున్నాను. ఇంక నిచ్చటనే యుండి నిన్ను బంగారమున జేర్చి శిరసా వహించెద!! ఇంక నా రత్నమును వీడి యెచ్చటకు బోను" అని చెప్పుచు నాపిచ్చి దచ్చటనున్న రత్నకంబళముపైఁ జతికిలఁ బడి యేమేమో పాటలు బాడఁజొచ్చెను. గజపతి బాలిక ప్రసన్నవదనముఁ జూచి యీమె యిదిమొదలు దానికనుకూలించునని యెంచి:

సుందరీ! నేఁ బోయివచ్చెద. దాసీ దాస జనములు నీ కే కొఱంతయులేక సేవించుచుందురు. నే నపుడపుడువచ్చి నీ సౌఖ్యము నరయుచుందు. నిత్య మీయున్మత్తను నీయంతఃపురమునకు రప్పించుకొని వినోదించుచుండుము. దయ యుంచుము.'

అని యామెను వీడ్కొని తనమేడ కరిగెను. నాఁటి మొదలాపిచ్చిది బాలికమేడకు పలుసారులు వచ్చుచు నామెకు వినోదములు గూర్చుచుండెను.

ఆనాఁడు శ్రీశైలముపై అరవిందావాసంతికలు యోగీంద్రునితో ముచ్చటించుచుండ వెనుక నెండిరాలిన యాకులలో మనుష్యుల యడుగుల చప్పుడయ్యెనని చెప్పియుంటిమి గదా. వారు నారాయణగజపతి గూఢచారులు. అరవింద

గజపతిని పెండ్లాడ నిష్టపడ లేదనియు నామె విజయసింహునిఁ బ్రేమించి యుండెననియుఁ దెలిసికొని ఇఁక నామెను విజయసింహుఁడు తనయొద్దకు బిలుచుకొనిపోయినచో తనకు లభింపదని నిశ్చయించి ఒకనాఁటిరాత్రి యందఱు నిద్రించుచుండగా నామె నపహరించి తనయంతఃపురమున నుంచుకొని ప్రత్యహము తా నామెయొద్దకువచ్చి తన్ను బెండ్లాడుమని బోధించుచు నామెచేఁ దిరస్కరింపబడుచుండెను.

# పదునాల్గవ ప్రకరణము

## అసూయ

అసూయ యనునది యసహ్యరూపయగు నొక పిశాచి. దీనికి క్రోధమును ఈర్ష్యయు చెలిమికత్తెలు. ఆ యసూయ యెవ్వని నాశ్రయించునో తక్కినవి రెండును వానిని విడువక కూడియుండును. ఆశయు అవివేకమును దాని కంతరంగ ప్రియసఖులు. ఆ యసూయా పిశాచ మావహించిన వానికిఁ బ్రపంచమున నెంతో మంచివారలఁ జూ ఈర్ష్యాక్రోధములే. ఒకని గుణకీర్తనంబులు వినియెనేని వానిచెవులు చిల్లులుపడిపోవుచుండును. ఎదుటివారి యౌన్నత్యమును భావించినచో హృదయము బ్రద్దలైపోవును. ఇతరుల సంపదలఁ జూచినచో కన్నులు మాడిపోవును. వేయేల! తన కెన్ని సౌఖ్యములున్నను సాటివారి యానందమున్నాంచెనేని వానిప్రాణములే పోవును. వానికి బంధుగులే ప్రాణగోష్ఠములు, మిత్రులే పరమశత్రువులుగాఁ దోచుచుండురు. తన స్నేహము జేయదగువా రేమైన మైత్రి నెఱపవచ్చిరేని వారి ఘనతనుఁజూచి యోర్వలేక లేనిపోని యపరాధముల మోపి యిఁక వారిమోములఁ జూడనొల్లడు. తనప్రాణములు పోయిన యవ్వాలగూడ నాపట్టు సాధించుచు నిదియే తన జన్మసార్థకమని తలంచుచు లోకమునకంతకు చేటుగాయమై తనకు ప్రాపగు అసూయాపిశాచమును చక్కగా నారాధించుచుండును. ఈ యసూయాపిశాచము మన సుదర్శనుని

పుట్టిబుద్ధి యెఱిగినది మొదలు తనవశము జేసికొనియున్నది. వర్ధమానపుర రాజసౌధమందలి యాలోచనాభవనమున సుదర్శనుఁ డొంటిగాఁ గూరుచుండి తనలో నీవిధముగా యోజించుకొనుచుండెను:—

ఆహా యెంతదుర్మార్గుఁ డీ విక్రమసింహుఁడు. సర్వవిధముల నాకుఁ బ్రక్కలోనిబల్లెమైయున్నాఁడు. ముందు నా ప్రజలకు నాకు నంతఃకలహములు గల్పించెను. అంతతోఁబోక నా కుమారుని నాలోనుండి వేఱుచేసెను. అందునను తృప్తి నొందక నాకుమారితను గూడ నక్రమముగా నపహరించెను. వీనికిఁ దగు ప్రతీకారము జేయఁ దలంచినచో నా ప్రజలందఱు వానియెడ పక్షపాతులుగాఁ దోఁచుచున్నారు. నాతనయను గజపతికొసంగి యాతని సాహాయ్యమున నా దురాత్ముని పొగరడంపఁదలంచుచుండ నెట్లో సమయముఁ గనిపట్టి యింత పని యొనర్చెను. ఔరా, ఆ యోగీంద్రుఁడు నిక్కమగు యోగియనియే నమ్మితిని. నాపట్టి దొంగిలింపఁబడుట కా దురాత్ముఁడే యానుపానులన్నియుఁ గనిపట్టియుండును. ఇఁక నిట్లు యోజించుటవలన నేమిప్రయోజనమున్నది. చేయందగు కార్యము నాలోచించి శత్రువుల నడంపవలయును. ఇపుడు నాతనయను కల్యాణపురాధీశుఁ డపహరించిన వృత్తాంతమును దెలుపుచు నేనిందులకా విక్రమసింహునిపై దాడివెడలనున్నాఁడననియు మీరు మీ యపరిమితంబులగు సైన్యంబులతో నాకు సహాయులుగా రావలయుననియు, అట్లు వచ్చి వారింజయించిన, నా తనయను మీకొసంగుటకు సిద్ధ

ముగ నున్నాఁడననియు, సమాచార మంపెద"నని యోజించు
కొని యొక యుత్తరము వ్రాసి తనకు నమ్మికగల చారునొక్కని
రావించి వాని కేమో ప్రబోధించి యాజాబునొసంగి కొండ
వీటిదుర్గమునకంపి యాతఁడు చిటికెలతోఁ బందిలి వేయుచు,
తనప్రయత్నములన్నియు ఫలించినట్లే తలంచి సంతసించుచు
కల్యాణపురముపై దండయాత్రకుఁ బోవఁదగు సన్నాహము
లొనర్చుచుండెను.

# పదునైదవ ప్రకరణము

## విశ్వాసఘాతుకము

నారాయణగజపతి దుష్ప్రభుత్వ విషయ మిదివరలో మీ కించుక తెలియఁబఱచియే యుంటిమి. అతఁ డెంతబలీయుఁడగు ప్రభువైనను ధైర్య సాహసాదిగుణము లాతనికి పరిపూర్తిగా ప్రకాశించుటలేదు. ఎంతటి యఖండరాజ్యవైభవము లున్నను ఆశాభిభూతుఁడగుటచే మిత్రుఁడనియు శత్రుఁడనియుఁ గూడ పాటింపక అదనుజూచి యెదుటివారి రాజ్యము నపహరింపఁజూచుచుండును. వాని వంచనోపాయముల కంతములేదు. ఆశకు మితిలేదు. మనశ్శాంతి మొదలేలేదు. తనకెంతటి శత్రుఁడైనను యెదుటఁబడి యుద్ధమొనర్చిన జయాపజయము లెవ్వరికిఁ గల్గునో యనియు అందువలన నున్నరాజ్యమునుగూడ బలియులైనచో పగవారలే గైకొందురనియుఁ దలంచి బహిరంగముగా యుద్ధమొనర్పఁ బోవుట యాతని మతముగాదు. ఎవరైన నొక రాజ్యమునకై యిద్దరుగాని పలువురుగాని యుద్ధ మొనర్చుకొనుచుండునపుడు సమయము గనుపట్టి పిట్టతగవు పిల్లిదీర్చినట్లు వారిని వంచించి యారాజ్యము తానపహరించుట వాని రాజనీతి. అతఁడు తనరాజ్యమున పెద్దపెద్ద యుద్యోగముల బలవంతులగు తన జ్ఞాతి కుటుంబములలోని వారికే యొసంగి వారి సాహాయ్యమున రాజ్యపరిపాలనఁ జేయుచుండెను. వానికి సన్నిహిత జ్ఞాతియు సర్వసైన్యాధి

పతియు నతిప్రియుండును నగు చండసేనుండను నొకఁడు గలఁడు. అతఁ డన్నిగుణములయందును తన ప్రభువును ఇంచుకయుఁ దీసిపోవడు. విషయలంపటుఁడు. మధుపానలోలుఁడు. అయినను రాజకార్యములలో, సందునను ముఖ్యముగా కుతంత్రములయందు, సాహసించి ముందంజవేయు స్వభావముగలవాఁడు. ఆతఁడే నారాయణగజపతికి కుడిభుజమువంటివాఁడు. వారిద్ద ఱొకనాఁటి మధ్యాహ్నమున కొండవీటి రాజమందిరమున నేకాంతముగా గూరుచుండి సంభాషించుకొనుచుండిరి.

గ:—చండసేనా! నీ యభిప్రాయ మేమి?

చండ:—మహారాజా! యిందభిప్రాయ మేమున్నది!! అతఁడు తన శత్రువులపై పగసాధింప తనకూతును మీకొసంగి మీతో సఖ్యమొనర్చి తనపట్టు సాధింపనున్నాఁడు. ఆతఁడు ప్రజాసమ్మతుఁడు గాఁడు. యుద్ధమున వాని సైనికులు కపటమువిడిచి ప్రవర్తింపరు. ఇఁక వానికి మూర్ఖమును అసూయయే తక్క ధైర్యమును రణకౌశలమును లేవు. ఇట్టివానికి సహాయముగా మనము వారిపైకి యుద్ధమునకుఁ బోయితిమేని కొండనాలుకకు మందువేయఁబోవగా ఉండేనాలుకగూడ యూడిపోయిన ట్లగును. ఆతఁ డొకవేళ బందుగులగువారికి లోఁబడి మనపైకి వారితోఁ గలిసి తిరుగఁబడినను బడవచ్చును. తరువాత నాతనితనయను వారి కొసంగ నభిప్రాయపడవచ్చును. అందున కా విజయసింహాదులు, గడంగినచో మన కామె దక్కదు.

అశోకుడును వాసంతికయు నెచ్చట నేమేమి కుట్రలు జేయుచున్నారో దెలియుటలేదు. బహుశః వారు వారికి సహాయులుగా వత్తురు.

గజ:—ఆ యశోకుఁ డెక్కడనుండునదియుఁ గనుపట్టి వానిం బరిమార్పుమనియు వాసంతిక యుపికి నరసి యామెను మనకొప్పగింపమనియు తగినుపాయమును జెప్పి మననందకుని కొండఱితోఁ బంపితిని.

చండ:—ఇది బాగుగానున్నది. అశోకు డరవిందను విజయసింహున కొసంగనిచ్చగలవాడు. అతఁడు మంచిచురుకైనవాఁడు. బలవంతుడు. ధైర్యశాలి. కల్యాణపురాధీశుని యెడ పక్షపాతముగలవాఁడు.

గజ:—ఆకారణముననే తండ్రికి విరోధియయ్యెను.

చండ:—వాడు ప్రాణములతోనున్న నాతని చెల్లెలిని మనకుఁ దక్కనీయడు. మరియు చాల ననిష్టములు జేయుచుండును గాన వానిని జంపించుటయే మంచిది కాని యీవాసంతికను మనయొద్ద జేర్పమని చెప్పుటలో మీ యభిప్రాయమేమి?

గజ:—(నవ్వుచు,) మిత్రమా నాతోఁబాటు నీకును నొక్క కన్యకారత్నమును గూర్పవలయునని!!

చండ:—మహాప్రసాదము! ఆ కన్యారత్నములనేగాఁదు, యీ సమయమున వర్ధమానపుర రాజ్యలక్ష్మినిగూడ మనము చేపట్టవలయును.

గజ:—చండసేనా, నీ యాలోచనము లతిచిత్రములుగా నున్నవి. సుదర్శనుఁడుండ నది యెట్లు పొసగును.

చండ:—ఇంకొక్కడి సుదర్శనుఁడు. అతఁడు తన శత్రువులచే పట్టుబడుటగాని, లేక లోఁబడి, వారితో నేకీభవించుటగాని, సంభవించును. మన మీ సమయమునుదాటనీయక వర్ధమాన పురమును స్వాధీనపఱచుకొనవలయును. అశోకునిజాడ నరసి వాని వధింపవలయును.

గజపతి:—ఒకవేళ కల్యాణపురమువారు మనపై దండెత్తి వచ్చినచో.

చండ:—వర్ధమానపుర మశ్రమమున మనకు స్వాధీనమవునుగదా!! ఇఁక మనయుభయ సైన్యముతో నాసైన్యమును గలుపుకొని వారిం జయింపవచ్చును.

గజ:—ఈ యూహ చక్కగా నున్నది. ఇపుడా సుదర్శనునకు ప్రత్యుత్తర మంపవలయును గదా.

చండ:—తప్పక వంపవలయును.

గజ:—ఏమని ?

చండ:—నీవు రేపటిరోజు ప్రయాణమై సేనలతో కల్యాణపురమును ముట్టడింప, తోడనే మేము మాయపరిమిత సైన్యములతో నీకు సహాయులముగా వచ్చి వాని ధ్వంస మొనర్చెదమనియు జాబువ్రాసి వానికిఁ బంపుదము.

గజ:—సరియే! యాతఁడట సైన్యయుతుఁడై పురము దాటుటతోడనే నీవు మన సేనలతో నరిగి యాపురమును స్వాధీనమొనర్చుకొనుము. అవ్వల వాసంతికను వెదకి తెప్పించి నీకు పాణిగ్రహణ మొనర్చెద.

చండ:—మహారాజా చిత్తము.

అని మాటలాడుకొనుచు వారిద్దరు సాయంతనమగుటచే నగరునందలి రాజ్యకార్యముల విచారింపఁబోయిరి. ఇట్టి విశ్వాసఘాతుకుల నీ వసుంధర యెట్లు మోయుచున్న దోగదా!

# పదియారవ ప్రకరణము

## క్రొత్తమిత్రుడు

నాటియుదయమున కల్యాణపురపు యువరాజగు విజయసింహుఁ డెచ్చటికో కొంతసైన్యములతోఁ బోవ సన్నాహ పడుచుండెను. ఆఱువందల కాల్బలమును నన్నూరాశ్వికవీరులును యువరాజున కాప్తులగు రాజపుత్రులు కొందఱును వివిధాయుధప్రాణులై ప్రయాణమున కాయత్తమై యుండిరి. విజయసింహుఁడు మిక్కిలి యుత్సాహము మోమున తాండవింప ప్రయాణ శుభలగ్నమున కెదురుచూచుచుండెను. ముహూర్తమున కింకను జామాలస్యమున్నది. ఆపట్టణమునకు క్రొత్తగా వచ్చిన యొకపురుషుఁడు విజయసింహుని యాశ్వికసైన్యముతోఁ జేరి ప్రయాణమొనర్ప సిద్ధపడియుండెను. అతఁడు చాల బలిష్ఠుడు; యుద్ధరంగములలో చాల నాటితేటినవానివలె నాతని యొడలు గట్టిపడి కుస్తిపట్లకును వ్యాయామమున కనుకూలముగ నున్నది. అతఁడా సమూహమున నెవరిమోము గాంచిన నేమోయని యోచించుచు మరల నింకొకనిపై పుజూచుచున్నటులే యొనర్చుచు తనవైఖరులెవరైనఁ జూతురేమోయని మరల నందఱితోఁ బాటు సహజములగుఁ చూపులు బఱపుచుండెను. మహామేధావియగు విక్రమసింహుఁడీవైఖరులంతయుఁ గనుపట్టి యేమియో యోచించి యీవిధముగ నతనితో సంభాషించెను.

"ఓయీ! నీ వెవ్వరవు?"

పురుషుఁడు తెల్లఁబోయి తనవైఖరి మాటుపఱచుచు "మహారాజా నేను రాజపుత్రుఁడను" అనెను

విక్ర:—నీపేరేమి?

పు.—వీరసేనుఁడు.

విక్ర:—నీవెచ్చటివాఁడవు?

పు:—మాది యుత్తర హిందూస్థానము.

విక్ర:—ఇచ్చటి కెందుకు వచ్చితివి?

పు:—మాతండ్రితాతలరాజ్యమును శత్రువు లక్రమముగా నపహరించి వారిం జంపిరి. అందువలన నేనచ్చట నుండనొల్లక ఈదేశమున నొకప్రభువునొద్ద రాజవీరున కుచితమగు నుద్యోగ మొక్కటి సంపాదించుకొని కాలంబుగడప వచ్చితిని.

విక్రమసింహుఁడించుక యోజించి "మాయొద్ద నిట్టి యుద్యోగమున చేరువారు ముందుగా మాసైనికవీరులలో నొక్కనితో కత్తిసామునందును మల్లయుద్ధమందును జయించి నచో నిందు చేర్చుకొందుము" అనెను. పురుషుఁడు 'సరియే' యనియెను. తోడనే విక్రమసింహుని సైనికులలో నొకవీరుఁడతనితో పందెమునకుఁ గడంగెను. ఇరువురును గత్తిత్రిప్ప నారంభించిరి. జనులందఱు వారిలో నెవ్వరికి విజయము గల్గునో చూతమని యొకరినొకరు త్రోసికొని వచ్చుచుండిరి. కొలఁదిసేపటిలో క్రొత్తపురుషునికే విజయముగల్గెను. విక్రమసింహుఁడా జనసమూహమునుజూచి యెలుగెత్తి, "యిపుడీ క్రొత్తపురుషునికి విజయము గల్గినది. వీనికి మాసైనికదళమున ప్రథమబహుమాన

మిమ్ముఁబూనియుంటిమి. ఆక్షేపించువారెవ్వరైన నిందున్నచో వెల్వడవచ్చును" అనెను. 'నేనున్నాఁడ'నని చెప్పుచు నొక కుమారుఁడట కరుదెంచెను. ఇతఁడాకారమున మన యాంధ్రుని వలె నుండెను గాని వేషముచూడ పార్సీకపు యోధునివలెనుండెను. అతఁడా రాజునకు నమస్కరించి పురుషునిఁజూచి భుజాస్ఫాలన మొనర్చెను. పురుషుఁడాతనిం జూచినతోడనే పదియో తనకు లభింపఁదగువస్తువు దొరికినట్లు కొంతసే పటులే చూచి తల పంకించి వానితోఁ బోరఁగడంగెను. జనులందఱంతకుముందు మేటి మొనగాఁడగు కల్యాణపురయోధుని లెక్కసేయక యొక్కనిమిషములో జయముగొన్న యాక్రొత్తపురుషుఁ డెక్కడ— కుమారుఁ డెక్కడ యని చెప్పుకొనుచుండిరి. వారికా యిరువురు క్రొత్తవారే. ఆవీరు లిరువురు మల్లయుద్ధమునకుఁగడంగిరి. ఒకరి కొకరెంతమాత్రము తీసిపోవుటలేదు. జనులందఱు నంతటి బలీయునితోఁ బోరుచున్న యాకుమారుని ధైర్యకౌశలముల కచ్చెరువందుచు నొకరినొకరు త్రోసికొనుచు ముందునకువచ్చి వారిం జూచుచుండిరి. వారితో నొక పిచ్చిదిగూడ నిలుచుండి యందఱిమొగములుఁజూచుచు "అబ్బా!! మీరందఱు వెఱ్ఱివారలా? ఆ పోట్లాడుచున్నవారికేమి పిచ్చిపట్టినదా? పిచ్చిబట్టినవారికి నేను మందు వేయగలను. ఏమో నాకేమియువలదు. నన్నుఁ బోనిండు" అని యా జనసమూహమును దప్పించుకొనుచు ముందునకుఁ బోవుచుండెను. వారందఱా మెమాటలకు నవ్వుచు త్రోవవిడుచుచుండిరి. ఆమె యటులే రాజు కూరుచున్నతావు కరిగి యందొక యెత్తగు చెట్టుగొమ్మపైఁ గూర్చుండి

గీ. బాల గోపాల గోపికా ప్రాణనాథ
ధరణి సుజనుల నలరింపఁ దలచినీవు
పాపవర్తనులకుఁ గనుఁగ్రాఁమి యెచట
నెచట నేరూపమున నివసించు దేమొ
ఇపుడు బృందావనంబున నింపుమీఱ
తోడి బాలురగూడి సంతోషమమర
ఆటలాడఁగ నెంచు నీ యను నెఱింగి
తనకు నేలికయౌ కంసదానవునకు
సంతసము గల్గగానిన్ను సమయఁజేయ
మాయవేసంబుఁదాల్చి దుర్మార్గచరుఁడు
అతి బలుండీతఁడు ప్రలంబు డనెడివాఁడు
నీకు నుద్దిగఁ జనుదెంచె పీఁకమెఱయ
నిపుడు బంధించు వీని గుట్టెఱిగి వేగ
దంటవౌ నీకు నేఁ జెప్పఁ దగినదేమి?॥

అని పాడుకొనుచు నాపిచ్చిది యాజనసమూహము నుండి దాటి యెటకోఁబోయెను. కుమారుఁ డా పురుషునితో మల్లయుద్ధమొనర్చుచు నతినేర్పు మెఱయ నాతనిక్రిందదోసి పైకిలేవకుండ ద్రొక్కిపట్టి వాని కంచుకాంతరమున గుప్తముగా దాచఁబడియుండు కొన్ని వస్తువుల నతిలాఘవమున గ్రహించెను. ఇదంతయుఁ జూచుచున్న విక్రమసింహుఁడు తనకుమారున కేమో సైగచేసెను.

తోడనే యాతఁడిరువురు రక్షకభటులను పిలుచుకొని పోయి .వారి నిద్దఱను రాజునొద్దకుఁ దెచ్చెను. విక్రముఁ డా

పురుషునింజూచి "నీ వెవ్వఁడవు? నిక్కముగా చెప్పుము" అనెను. పురుషుఁడు మాటాడనేరక తడఁబడుచుండెను. విక్రమసింహుఁడు వానిచందముల బాగుగానూహించి "సరియే నీవిషయము ఆవల విచారింపఁబడును. అని వాని రక్షకభటులవశమొనర్చి వానినిఁ బంపివై చెను. విజయసింహుఁడు ఆకుమారుంజూచి నీ పేరని నెఱుగుదువా?" యనెను.

కు:—ఎఱుగను.

వి:—నీ వెచ్చటివాఁడవు.

కు:—పారసీకమందలి వస్తాదును.

అతనిం జూచినది మొదలు విజయసింహునకు ప్రియమగు వస్తువేదియో స్ఫురణకావచ్చుచుండెను. ఆపాదమస్తక మాతనిపై పటులేజూచుచు

"ఓయీ, నీపేరేమి? అని యడిగెను

కుమా:—యువరాజా నన్ను సుమిత్రుఁడందురు.

యువ:—నీవిచ్చట నేదైన యుద్యోగమభిలషించి వచ్చితివా?

కుమా:—అవును మహారాజ! ఉత్తమప్రభుని సేవ యొనర్చి నాజన్మము సార్థకమొనర్చుకొనదలచి యున్నాను.

విక్రమసింహుఁడా కుమారుని ముఖభావములఁదిలకించి యాతఁడు తమతో నేదియో మంతనమును సంభాషింపఁదలఁచుచున్నటు లూహించెను. తోడనే యచ్చటనున్న సైనికులకును దూరముగాఁబోవ నాజ్ఞాపించి వానితో నీవిధముగాఁ బ్రసం

గించెను. 'నీ వాతనియొద్దనుండి గ్రహించినవస్తువేమిటి?' కుమారుఁడు తన యొద్దనున్న యొకవస్తువు నాతనికొసంగెను. విక్రమసింహుఁడదివిప్పిచూడ నందు మూఁడుప్రతిమలు చిత్రింపఁబడియుండినవి. రాజాపటముంజూచి యాశ్చర్యమున విజయసింహునికొసంగెను. విజయసింహుఁడా చిత్రముల నద్భుతదృష్టులతోఁ జూచి మరల కుమారునివంకఁ జూడసాగెను.

అతఁడు మరల 'నీకు నిజముగు పేరేమి?' అని యడిగెను.

కుమారుఁడు:—సుమిత్రుఁడనే.

విక్రమసింహుడు:—ఈచిత్రపటము వానియొద్దనున్నదని నీవెట్లు గ్రహించితివి.

విజ:—ఇంతకాపిచ్చిది పాడుపాటలు సాభిప్రాయముగ నున్నవి. విక్రమసింహుఁ డించుక యోచించి ''ఈపటములోని వారికిని నీకును ఆ కృతులవలన సంబంధముండునట్టు లున్నది.'' అనెను.

కుమారుడేమియో యోంచిచి ''మహారాజా, యిదిగో చిత్తగింపుడు'' అని యతనికేదయో యొకవస్తువునొసంగెను.

రాజావస్తువునుజూచి ససంభ్రమముగా ''ఆ! అట్లనా! దురాత్ముఁ డింతపనిచేయునర్చెనా!! కుమారా, యిఁక త్వరపడవలయును'' అనెను. విజయసింహుఁ డావస్తువునుగైకొని కొంతవడి చూచెను. ఆతనికన్ను లగ్నికణములవలె నెఱ్ఱబాఱెను. మోము జేగురించెను. అతఁడు బిగ్గరగా నేమో చెప్పబోవు చుండ మిత్రుఁ డనునయించి, యువరాజా ''శాంతింపుము. అవి మాయలమారి

జంబుకంబులు. వానిని వంచనచేతనే జయింపవచ్చును. దండో
పాయమక్కరలేదు అనెను.

విక్ర:—(మిత్రునిజూచి) కుమారా నీవింకను ఇటులే
యుండనేల.

మిత్రు:—అన్ని విషయములు చూచితిరిగదా.

విక్ర:—సరియె! ఇఁక కార్యము త్వరలో సాధింప
వలయును.

అని యాముగ్వురు రహస్యాలోచనము చేయసాగిరి.
వారిమాటలన్నియు వినవచ్చుటలేదు. అందు కొన్ని మాత్రము
స్పష్టముగా వినవచ్చుచుండెను.

విజ:—అచ్చ ..ను సుగాప ... రున్నారు.

మిత్రు:—మహి ... మహిషా ... మర్దని,

విక్ర:—తండ్రి ... ముపై కి ... నని ... గాగము ... చితివా.

మిత్రు:—ఆ నిజము ... వానికి ... వ్రాసి .. యున్నాడు.
రేపటి ... అంద ... లసి .. వత్తు ... దలంచెద.

విజ:—బందుగుల యుద్ధ ... తప్ప .. పనియగుచున్నది.

మిత్రు:—వీనిని బంధిం ... లయును అచ్చట ... దప్పిం
... వలెను.

విక్ర:—వర్ధ ... ము మాట.

విజ:—ఆదుర్మాతుఁడు ... దాని హరించును.

మిత్రు:—కానిందు ఉపాయములున్నవి. వంటయింటి
కుందేలు

అని వారేమేమో చాలసేపు మాటలాడుకొని తమ సైన్యముల కానాటి ప్రయాణము నిలుపనాజ్ఞాపించి కోట తలుపులు భద్రముగామూయించి యాక్రొత్తమిత్రునితో గలసి రాజభవనమున కేగిరి.

# పదునేడవ ప్రకరణము

## పట్టుంబడుట

తెల్లవాఱుసరికి కల్యాణపురము చుట్టును, సుదర్శనుఁడు రెండువేలసైన్యములతో వచ్చి ముట్టడించెను. కోటలోనివారి కప్పుడే యీ సమాచారము తెలిసిపోయినది. ఆ పట్టణము లోనివారెల్లరు యుద్ధముజేయ నేర్చినవారగలే. విక్రమసింహుని సైనికులు యుద్ధమున నిలిచినచో చిచ్చుల పిడుగులే!! సమరమున తమ ప్రాణములనైన నర్పించి ప్రభుభక్తి ప్రదర్శించు వీరులు. ఆతఁడు వారినెల్ల తన బిడ్డలవలె మన్నించి ప్రేమించును. వారాతని తండ్రికన్న నెక్కుడుగాఁ దలంతురు. ఆతనిరాజ్యమున యుద్ధము నెఱుంగని పురుషు లుండరాదు. వ్యవసాయముచే జీవించువారికి, సైతము తీరుబాట్ల రోజులలో చదువు సాములు గరిడీలు మొదలగునవి నేర్పించి, వారిని జ్ఞానవంతులుగను శూరులుగను, తయారుజేయించి యుంచెను. ఇపుడా పట్టణమునందు పదివేలకాల్బలములును, ఆఱువేల యాశ్వికసైన్యమును, బలవంతులగు దండనాథులు వేయిమందియు సుదర్శనునితోఁ గలసి, నారాయణ గజపతి యేక్షణమున తన పురముపైకి దండెత్తి వచ్చునోయని సిద్ధముగా నుండిరి. కోట ముట్టడించియున్న సుదర్శనుఁడు పట్టణములోనికిఁ జొరఁబడి విక్రమసింహునిపైఁ గల పగ నెప్పుడెప్పుడు దీర్చుకొందునా యని తలంచుచు తనకు సహాయముగా వతుమనిన

గజపతి సైన్యములకై యెదురుజూచుచుండెను. కోటలోపలి వారు సప్రమథుడగు శౌరి తమపైకివచ్చినను, నొక్కక్షణ మున నుక్కడంతుమని, యుత్సహించుచుండిరి.

సుదర్శనుఁడు మాటిమాటికి, తనచారులను నాల్గువైపుల కంపుచు గజపతి సైన్యములు తనకు సహాయములుగా వచ్చుచున్నవో లేవో యని చూచుచుండెను. కోట దక్షిణపు గవనియొద్ద సుదర్శనుఁడు రెండువేల సైన్యములతో నిలచి యా ద్వారమును భేదింపఁ దగు ప్రయత్నము లొనర్చుచుండెను. నాలుగై దేనుఁగుల నొక్కసారి బురికొల్పి యాదుర్గ ద్వారమునకు డీకొల్పుచుండెను. ఆ గజములు పరుగునవచ్చి తమ తలలచే నాకవాటముల డీకొను శబ్దములు వినువారికి వెఱగుగొల్పుచుండెను. ఎంతకును కవాటములు తెఱువఁబడ లేదు. బలీయులగు సైనికులు కొందఱు కోటతల్పులక్రింద గునుపములచేఁ ద్రవ్వ నారంభించిరి. విక్రమసింహుని సైనికులు బురుజులపై నెక్కి క్రిందనున్న సుదర్శనుని సైనికులపై వారి యలుగులను రాళ్లను నిప్పులను రువ్వుచుండిరి. వారి నటునిలువ నీయకఁ దరుముచుండిరి. సుదర్శనుఁడు గజపతి సైన్యములు వచ్చునని యుబ్బుచు తనవారిని కార్యముసాధింపఁ బురికొల్పుచుండెను. ఈ విధముగా సాయంకాలమయ్యెను. విక్రమసింహుఁడు రెండువేల సైన్యములతో దక్షిణద్వారమును గాచుచుండెను. ఉత్తరద్వారమునొద్ద విజయసింహుఁడు నాల్గువేల సైన్యములతో నిలిచి గజపతి సైన్యయుతుఁడై వచ్చిన

తోడనే యాతని నొక్కమాఱుగా సమరమున మట్టుపెట్టఁ జూచుచుండెను.

మిత్రుండు కొన్ని సైన్యములతో తూర్పుద్వారమును గాచియుండెను. చీకటి పడినది. అందరును యుద్ధపుఁ బనులు మాని యూరకుండిరి. కోటలో వారుమాత్ర మతి జాగ్రత్తగా గజపతి సైన్యములు ఎపుడు వచ్చిపడునో యని కాచుకొని యుండిరి. ఆ కోట యుత్తరద్వారము నానుకొని చిన్నచిన్న గుట్టలును పెద్ద యరణ్యములును గలవు. ఆ చీఁకటియం దా గుట్టలను అరణ్యమును చూచుటకు మిగుల భయంకర ముగ నుండెను. గిమ్మని కీచురాళ్ళ నిస్వనములను ఘూకములు మొదలగు పక్షులకూఁత లాయంధకారమునఁ భయంకర ముగా వినవచ్చుచుండెను. కోటలోని సైనికు లెవ్వరు నిదురించుట లేదు.

ఆ సమయమున నుత్తరపు బురుజుపై విజయసింహు డొంటిగా నిలుచుండి, గజపతిసేన లేవంకనుండియైన వచ్చుచున్న వేమోయని సూక్ష్మదృష్టులతో గనుపట్టుచుండెను. ఆతని కా యరణ్యమునుండి, యెవ్వరో యొక వ్యక్తి తా నున్న వైపునకు వచ్చుచున్నట్లు తోఁచెను. ఆవ్యక్తిదేహము ఈ గాఢాంధ కారమునకన్న నల్లనై భయముగొల్పుచుండెను. ఆ వ్యక్తి యెవ్వరు? ఈ యంధకారమున కధిష్ఠానదేవతయా, లేక పిశా చమా? విజయసింహుఁ డటులే యా వచ్చుచున్న వ్యక్తివైపుఁ జూచుచుండెను. ఆవ్యక్తి యాతని సమీపించినది. ఆమూర్తి యా ప్రాంతముల నపుడపుడు తిరుగుచుండు పిచ్చిదియే!!

పాపము పిచ్చివారలకు రాత్రి పగలను పరిజ్ఞానముండదుగదా! పిచ్చిది "అయ్యయ్యో! కాఱుమబ్బులు గమ్మినవి జగమంతయు అంధకార మావరించినది పిడుగులు పడునని భయమందితిని. దానికి మంత్రమున్నది.

అర్జునః ఫల్గునఃపార్థః కిరీటీ శ్వేతవాహనః।
భీభత్సో విజయ విజయ విజయా?

నీవే నా విజయుఁడవు. నీవేనా నిజముగా జెప్పుము. జెప్పుము. నాకు భయమగుచున్నది.

విజయ:—నేనే విజయుఁడను. కాని నీ వెన్వఁరవు.

పిచ్చిది:—నేను కాళికామూర్తిని.

విజ:—అట్లయిన పిచ్చిదానివలె నగపడుచుంటివేమి?

పిచ్చి:—పిడుగులకు భయపడి పిచ్చిదాననైతిని.

విజ:—అవి నిన్నేమి చేయును?

పిచ్చి—అయ్యో! ఈ చీఁకటులు నన్నపహరింపఁ జూచుచున్నవి. ఆపిడుగులు నాపైఁబడ నుంకించుచున్నవి. విజయా, మాటల సందునఁబడి మఱచిపోతిని ఈ పిడుగులను నీ పిడికిటఁబట్టి బంధింపగలవా!

విజయ:—బంధించెదను, భయ మందకుము.

పిచ్చి:—ఎప్పుడు.

విజ: —వానిని రానిమ్ము.

పిచ్చి:—వచ్చియే యున్నవి. ఇంకను మఱికొన్నివచ్చి నచో నన్నిటిని యొక్కటేసారిబట్టి నలిపివేయఁ దలంచు

చున్నావా? అట్లు జరుగ వీలులేదు. ఆ పిశాచముల సమూహము వచ్చుటను వర్షాకాలము రావలయును. తక్కిన మేఘములు భయపడి విచ్చిపోయినవి. ఇప్పుడు చేఁజిక్కినఁదానిని బట్టుము.

విజ:—నీ మాటలయం దర్థమేమో వేఱుగా నున్నది.

పిచ్చి:—విజయా నామాటల కర్థము లేదా! యేమి! కావుననే పిచ్చిదానవని జను లనుకొనుచున్నారు. 'నమ్మినాన బోయగా పుచ్చి బుఱ్ఱలైనవి' వారేమో సహాయమొనర్తురని కొండంతయాసతో వీరు సాహసించిరి. వారు నమ్మించి గొంతు కోసినట్లు మొదటికే మోసముఁదెచ్చిరి. ఇఁక నేమి వారిసహాయ ములేదు, లేదు. విజయసింహుఁ డించుక యోచించి "నీవు నిజముగా కాళికాదేవివే యగుదువా" యనెను?

పిచ్చి:—ఏమో నేనెట్లు చెప్పఁగలను. ఈయంధకారమున నాపేరు గనుపించుటలేదు. పేరుబోయిన ప్రాణములుబోవును. పోయి వెదకికొనియెద.

అని యా పిచ్చిదాయరణ్యమున నగపడకుండాఁ బోయెను. విజయసింహుఁ డనుమానదృష్టులతో నావంక నే చూచుచు యోచించుకొనుచుండెను. అతనికి నంధకారా రణ్యమునుండి యొకగీతమిట్లు వినవచ్చెను.

గీ॥ భవ్యచరితుని కుంభసంభవుని తనదు
ప్రాపున వసింపఁదగు వానిఁ బరిభవించి
తఱుమఁగొట్టిన పాంచాల ధరణివిభుని
కన్నుమిన్నుల నెఱుగక యున్నవాని

బలముసూపట్ట నీవేగి పట్టితెచ్చి
నీదు హితకోటిలోఁజేర్చి నిండుకరుణ
నతనిపట్టిని పాంచాలి నతిప్రియమునఁ
బరిణయంబాడి యవ్వేఁ ప్రబలశత్రు
సంఘములగెల్చి నీపేరు సార్థకముగ
నవనిఁబాలించు విజయ, లోకైకవీర॥

ఆపాట వినవచ్చినదిక్కునుండి యెవ్వరో వచ్చుచున్న టులాతనికిఁ బొడగట్టెను. ఆతఁడు కరవాలము సవరించుకొని తిన్నగా వారెవ్వరని ప్రశ్నించెను.

ఒకవ్యక్తి:—నేను మిత్రుండను.

విజ:—మిత్రమా! యెచ్చటనుండి వచ్చుచుంటి

మిత్రు:—(నవ్వుచు) మీకేమో యద్భుతమును జూచి నట్లు రిచ్చబడియుంటిరేమి.

విజయ:—అవును, అంతయు ఆశ్చర్యముగాను అభి ప్రాయగర్భితముగాను న్నది.

మిత్రు:—విజయసింహునిపైఁ జేయివైచినవ్వుచు నీవు విజయుడవుగదా, రమ్ము తెల్లవారుసరికి నాకార్యము సానుకూలముగావలయును. అని మాటలాడుకొనుచు వారిద్దఱు పురములోని కేగిరి.

రాత్రి రెండుజాములైనది. పట్టణముయొక్క దక్షిణ ద్వారమునొద్ద కోలాహలము బయలుదేరినది. ఆవైపుద్వార మును దెఱచుకొని సుదర్శనుని సైనికులు లోపలఁ బ్రవేశించిరి.

లోపల వారాయుధముల సవరించుకొని యుద్ధమునకుఁగడంగిరి. విక్రమసింహుఁడు సుదర్శనునితోఁ దలపడెను. సుదర్శనుఁ డతి క్రోధమున నాతనిపై శరవర్షము గురిపించుచుండెను. విక్రమ సింహుఁ డతిలాఘవమున నాతనియలుగులఁ దప్పించుకొనుచు, నాతని కొలఁదిసేపటిలో నొప్పించెను. ఇరువాగులవారును జయాభిలాషులై పోరసాగిరి. ఆరణమున తల లెగిరిపోవు చుండెను. మొండెములు క్రిందఁబడి దొరలుచుండెను. నెత్తుటి యేఱులు ప్రవహింపజొచ్చెను. పాపము సుదర్శనుని సైన్య ములు కడుస్వల్పములై నశించుటచే బలీయులగు కల్యాణపుర సైనికులతోఁ బోరాడఁజాలక వెనుదీయసాగిరి. గజపతి తన సైన్యములతోవచ్చి తమకు సాయపడునని వారంతవఱకు కొండంతయాసతో నుండిరి. సుదర్శనునకు ధైర్యము సన్నగిల్లి నది. అసూయమాత్రము విడువలేదు. ఎదుట విక్రమసింహు నితో పోరుచునే గజపతిసైన్యములకై నాల్గువైపులఁ జూచు చుండెను. ఆతనివెనుక నొకసైన్యము గనుపించినది అదియే గజపతిసైన్యమనిదలంచి ఆతఁ డత్యుత్సాహముతో విక్రమ సింహునితోఁ బోరసాగెను. వెనుకనుండి వచ్చినవారు సుదర్శ నుని సైనికులతోఁ బోరాడసాగిరి. సుదర్శనుని ఆశలన్నియు నిరాశలయ్యెను. గజపతి తన్నువంచించియుండునని యపు డూహించుకొనియెను. తన ముద్దుబిడ్డల హితోపదేశముల నిరాకరించి సమర్థుఁడగు కుమారరత్నమును దేశమునుండి వెడలగొట్టించిన ఫలమిప్పు డనుభవింపనున్నాడనని తలంచెను. ప్రాణములుండగా నిఁక నా కుమారునిముద్దుమోమును కన్ను

లారగాంచు భాగ్యము గలుగదుగదా యని విచారించెను. మరల ధైర్యము దెచ్చుకొని విక్రమసింహునితోఁ బోరుచుండెను. ఇంతలో విజయసింహు డెచ్చటనుండియో వచ్చి యాతని యశ్వముపై కుఱికి చేతనున్న కత్తిలాగికొని యాతని బంధించివైచెను. సుదర్శనుఁడు పట్టుబడియెనని యెలుగెత్తి విక్రమసింహుఁడు సింహనాదమొనర్చెను. తమ ప్రభుఁడు పట్టుబడుటచే సైనికులు విక్రమసింహుని శరణుజొచ్చిరి. దయాళుఁడగు నాతఁడు వారికభయమొసంగి తన ప్రజలతోఁ బాటు మన్నించెను. వారాతని సౌహార్దమును వేనోళ్ళఁ గొనియాడుచు సుఖముండిరి. విక్రమసింహుఁడు సుదర్శనుని ఒక రాజోచిత భవనమునను౦చి కాచుచుండెను.

# పదునెనిమిదవ ప్రకరణము

## కృష్ణా నేను నీ రాధను.

జాముర్రాత్రియయ్యెను. నాఁడు ఆషాఢశుద్ధపంచమి. భయంకరమగు గ్రీష్మమువలన జగమంతయు కాలిన లోహ ఖండమువలెఁ దపించుచుండెను. పెద్దపెద్ద పడమటి గాడ్పులు వీచుటచే గుండెలు బ్రద్దలుజేయు 'హూ' యను ధ్వని దక్క మఱియేవియును వినవచ్చుటలేదు. ఆకసమున నచ్చటచ్చట మబ్బులుబట్టి యాలేతవెన్నెలనుగూడ నగపడకుండ జేయుచుండెను. ఆ రాత్రి వర్ధమానపురపు ప్రాంతారణ్యములనుండి యొక పురుషుఁ డశ్వమునెక్కి పట్టణము వైపునకు వచ్చుచుండెను. ఆ యడవియందు పెద్దపెద్ద మఱ్ఱి, చింత, వేప, జమ్మి మొదలగు మహావృక్షములక్రింద చినుకులు సైతము బడనీయక తమశాఖ లొకదాని నొకటి యొఱసికొనునట్లు విస్తరించి యుండెను. క్రింద ఱాళ్లుముండ్లు నిండియుండుటచే నందు నడచుట మిక్కిలి కష్టముగా నుండెను. అచట భయంకరముగా నక్కలు గూబలు గూయుచుండెను. ఏ చెట్టుకొమ్మలనో పట్టి వ్రేలాడుచు కీచురాళ్లు గింగురుమను ధ్వనిఁ జేయుచుండెను. మొదలే చీకటి, పైన మబ్బు అందులకుఁ దోడంధకార బంధురమగు నరణ్యము. ఇట్టి భయంకరారావముల మధ్య నీ నిశీథిని నిర్జనమగు నా యడవియం దొక్కఁడుగాఁ బోయినచో గుండెలు బ్రద్దలుగాక మానునా !! ఆ పురుషుఁ

డీ భయంకర దృశ్యముల నేమియు సరకుఁ గొనక పట్టణాభిముఖుఁడై పోవుచుండెను. మబ్బువలన చిన్నచిన్న చినుకులు పడసాగెను. తొలకరియగుటవలన పెద్దపెద్ద యుఱుము లుఱుమసాగెను. నడుమ నడుమ తీగెలవంటి మెఱపులుగూడ మెఱయుచుండెను. క్రిందిమార్గము తిన్నగా లేకుండుటవలన గుఱ్ఱము సరిగ నడువఁజాలకుండెను.

పురుషుఁడాయశ్వమునుండి దిగి దానికళ్లెమును బట్టుకొని తిన్నగా నడిపించుకొనుచుఁ బోవుచుండెను. ఇంతలో వెనుకనుండి కృష్ణాయను పిలుపు వినవచ్చెను. పురుషుఁడాగి తన చేతి వాలు సవరించుకొని నాల్గువైపులఁ జూచెను. ఎవ్వరును లేరు. తళుక్కున మెఱుపొకటి మెఱసెను. ప్రక్కనున్న మఱ్ఱిచెట్టు క్రిందినుండి యొక వ్యక్తి తనయొద్దకు వచ్చుచున్నట్లు తోఁచెను.

పురు:—ఎవరు వారు?

వ్యక్తి:—కృష్ణా ! నేను నీరాధను.

పురు:—గొంతు సవరించుకొని మెల్లగా 'యెచ్చటినుండి ?

రాధ:—నీ వెచ్చటనుండి?

పురు:—ఉన్నచోటినుండియే.

రాధ:—వచ్చుచున్నచోటినుండియే.

పురు:—ఇచ్చటి సమాచారములేమి ?

రాధ:—అచ్చటి విశేషములేమి ?

పురు:—అంతయు చక్కగానే యైనది. ఇఁక యెద్దులు బండ్లు ఏకము కావలయును.

రాధ:—ఆవల కొండలు వెనుక వేయవచ్చును.

పురు:—యెచ్చటికిఁ బోవుచుంటివి?

రాధ:—నీ వెచ్చటి కేగుచుంటివి.

పురు:—మన పురమునకు.

రాధ:—ఆ దురాత్ముఁ డాక్రమించియున్నాడు.

పురు:—యెప్పుడు.

రాధ:—ఆయనసేవలతో దాటుట తోడనే

పురు:—ఎంత దుర్మార్గుఁడు. ఆమె యెచ్చటనున్నది?

రాధ:—భయములేదు, యిచ్చటనే.

పురు:—నీ వామె నెట్లు గలసికొంటివి?

రాధ:—నేను మహిషాసురమర్దనిని గదా! అడ్డమే ఘున్నది.

పురు:—ఇఁక త్వరగా సైన్యములతో నేగి వానిం ఱుమవలయును.

రాధ:—అంత శ్రమపడ నక్కఱలేదు.

పురు:—మఱి యెట్లు?

రాధ:—వాఁడు మధుపానాసక్తుడు. స్త్రీలోలుఁడు ని రాధ వానిచెవిలోనేమియో చెప్పెను.

పురు:—ఇది యన్నిటికన్న చక్కగా నున్నది. విష ను విషప్రయోగముననే నశింపజేయవలయును.

అని మాటలాడుకొనుచు వారా చీఁకటియడవిలోఁ పోవుచుండిరి.

మున మా భయంకరారణ్యమున వారి ననుసరింపఁ జాలము. వర్ధమానపుర రాజభవనమందలి యేకాంతమందిర మున గూరుచుండి రహస్యాలోచన మొనర్చు మఱియిద్దరిని గనుగొందము.

ప్రధముడు:—ప్రభూ, అతఁ డచ్చట పట్టువడియెనట.

రెండవవాడు:—భీమా! మనమనుకొనినదియు నంతియే గదా !!

ప్రధ:—ఇక నామెను వెదకి పట్టవలయును. వారిద్ద ఱినిఁ బట్టి వధింపవలయును. ఆ విజయసింహుఁడు ప్రాణ ములతో నున్నయెడ అరవింద యాతనికిఁ దక్కదు. మఱి రెండవవాఁ డున్నచో నీరాజ్యమును వాసంతికయు నాకు దక్కుట వట్టిది.

భీము:—దేవా ! అందుకు దగుప్రయత్నము లొనర్చు చునే యుంటిమి.

ప్రభు:—అట్లుకాదు రేపటినుండియు నీవే యందులకుఁ బూనవలయును.

భీము:—ప్రభూ! చిత్తము.

ప్రభువు:—నీ వా కార్యమును సాధించితివేని మంచి బహుమానమును బొందగలవు.

భీము:—దేవరా, తమదయయే నాకు పదివేలు.

వా రిట్లు మాటలాడుచుండగా వెనుక కిటికీ యవ్వల నెవ్వరో గుసగుసలాడిన శబ్దము వినవచ్చెను. వా రనుమా నించి లేచి నాల్గువైపులఁ జూచిరి. ఎవ్వరులేరు. రహస్యమును

నది మనుజుని పెదవిదాటి యవ్వలవచ్చెనేని కొలఁదిసేపటికే పృథివిగూడ దాటిపోవగలదు. అందునను దుర్విషయమగు రహస్యమగునేని వానిని బహిరంగమునకుఁ దెచ్చుటకు గోడలకుఁగూడఁ జెవులు మొలచును. ఇపు డీ గోడల కేమైన జెవులు మొలచి గుసగుసలాడుచున్నవేమో!! వారు మఱికొంతసేపటులే ముచ్చటించుకొని యప్పటికి నడురేయి దాటుటచే నిదురింపఁబోయిరి. సుదర్శనుఁడు కల్యాణనగరముపైకి దాడి వెడలి పోవుటతోడనే గజపతి పంపున తనసైన్యములతో వచ్చి ఈ వర్ధమానపుర మాక్రమించుకొనిన పాపాత్ముడగు సీతని, గజపతి సేనానియగు చండసేనుడని పేరఁజెప్ప వలయునా.

# పందొమ్మిదవ ప్రకరణము

## నీవు దేవీమాత్రివా ?

కల్యాణపురమునకు పడమటివైపున పట్టణమునకు రెండుమైళ్ల దూరమున నొక పెద్ద మామిడితోపు గలదు. తక్కిన మూడువైపుల చెరువుల కాలువలు, ఆకుతోటలు దివ్య కేదారములుగలవు. కాని యావైపున మాత్రము టెంకాయ మామిడి ముంతిమామిడి తోపు లతివిస్తారములు. అన్నితోపుల యన్నిటి ముందు చెప్పిన పెద్దమామిడితోపున్నది. దానికవ్వల చిన్నకొండగుట్టలును పెద్ద యరణ్యములు గలవు. ఆ తోపునం దొక దేవ్యాలయమున్నది. ప్రతి శుక్రవారము మధ్యాహ్నమా దేవికి నైవేద్య దీపారాధనలు జరుగును. ఈ విధముగా నాపట్టణాధీశుల తాతముత్తాతల తరములనుండి జరుగుచున్నది. మిగతరోజులలో నావైపున కెవ్వరుం బోవరు. ఆ పట్టణమున శివకేశవుల యాలయములు పెక్కులు గలవు. వానికి నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవ బ్రహ్మోత్సవము లతివైభవముగాం జరుగును. అయినను సంగరములందు విజయాభిలాషులగు రాజపుత్రు లాదేవి నతి భక్తి నారాధించి యామె ప్రసాదము నౌదలం దాల్చుచుందురు. ప్రతి శుక్రవారము విజయసింహుం డాదేవ్యాలయమున కరిగి యేకతంబున నాదేవిని ధ్యానించి ప్రసాదము స్వీకరించి వచ్చు చుండును. అతం డాదేవిని పూజించునపుడం దెవ్వరు నుండరు.

సాయంకాల మూఁడుగంటలు కావచ్చుచుండెను. విజయసింహుఁ డశ్వారూఢుఁడై మిత్రునితో నా వనముఁ బ్రవేశించెను. మిత్రుఁ డాయుధపాణియై యాలయ బహిర్ద్వార మొద్ద నిలుచి యాతోపు నాల్గువైపులఁ దిలకించుచుండెను విజయసింహుఁ డాలయద్వారమునుబంధించి నిమీలితనేత్రుఁడై దేవీధ్యానమును జేయుచుండెను. ఇంతలో ఆ వెనుక స్తంభము చాటునుండి చటాలున కత్తిదూసిన చప్పుడయ్యెను. విజయ సింహుఁడు కన్నులు దెఱచి చూచెను. అప్పుడే నఱుకఁబడి యొకశిరము మొండెము క్రిందఁ బొరలుచు వెచ్చనినెత్తురు కాలువలుగాఁ బ్రవహించుచుండెను. విజయసింహుఁడు ససం భ్రమముగ నాల్గువైపులఁ జూచెను. ఎవ్వరో యొక వ్యక్తి కృపాణపాణియై యాలయమునుండి యవ్వలకుఁ బోవుచున్నట్లు కనుపించెను.

విజయసింహునకు నేమియుఁ జేయుటకుఁ దోఁచుట లేదు. అతఁ డతి త్వరితమున నావ్యక్తిని సమీపించి నీవెవ్వరవని ప్రశ్నించెను. వ్యక్తి యేమియుఁ బలుకక తీక్ష్ణదృష్టులు నాల్గు వైపులఁ బఱపుచుండెను. విజయసింహుఁ డాయద్భుత ప్రద ర్శనముఁ జూచుచు నావ్యక్తిముందించుకసేపు నిలువఁబడి యెను. ఆతనినోటినుండి యప్రయత్నముగ 'నీవు దేవీ మూర్తివా' యను నక్షరములు వెలువడియెను.

వ్యక్తి:—అవును.

విజ:—మృతకళేబర మెవ్వరిది?

వ్యక్తి:—దుష్టదానవునిది.

విజ:—ఈతఁ డేమిదోష మొనర్చెను ?

వ్య_క్తి:—సజ్జనుల సమయింప క_ర్తివట్టెను.

విజ:—నీ వీతనిచర్యల నెట్లు గనుపట్టితివి?

వ్య_క్తి:—నేను సర్వాంతర్యామిని.

విజ:—ఎవరికొఱ కిట్లు తిరుగుచున్నావు ?

వ్య_క్తి:—నా ప్రాణముకొఱకు, విజయునికొఱకు, నా కృష్ణుని కొఱకు.

విజయసింహుఁ డించుక యోజించెను. చక్కఁగా నా వ్య_క్తిని పరిశీలింపఁ సాగెను. ఆ మూ_ర్తి యొడలంతయు నల్లని వస్త్రముచే నాఛ్ఛాదింపఁబడియుండుటచే నేమియుఁ గనుపింపుట లేదు. అతఁడిట్లు ప్రశ్నించెను.

నీ కృష్ణుఁ డెవ్వఁడు ?

వ్య_క్తి:—నా కృష్ణుఁడే.

విజ:—అతఁ డెచ్చటనున్నాడు ?

వ్య_క్తి:—నే నుండుమన్నచోట నున్నాడు.

విజయ:—అట్లయిన నాతని నాకుఁ జూపగలవా?

వ్య_క్తి:—అయ్యో! నీకేమి నేఁజూపుటేమి. నా కృష్ణునికి నీతోడిదే లోకమైనది. నా జోలిఁ దలచుటయైనలేదు. హా! కృష్ణా కృష్ణా ! నన్ను మఱచితివా ? దుష్ట దానవసంహారముదక్క నీకు మఱియొకటి వలదా ! సరియే యాలోక కంటకులఁ బరిమార్చియే నా భయముఖాపి నన్నుద్ధరింపుము. అదుగో దానవులు. ఇదుగో దానవులు. వారినిఁ బట్టి శిక్షింపుము. లోకముల నుద్ధరింపుము.

అని యేమేమో మాటలాడుచు నావ్యక్తి చరచర దేవ్యాలయమునుండి యీవలకు వచ్చి యా చీఁకటిలో నా తోపునందుండి యా కొండగుట్టల సందున మాయమయ్యెను. విజయసింహుఁ డత్యాశ్చర్యమున నీవలకు వచ్చెను. మిత్రుఁడా ప్రక్కనుండి యెవ్వరినో యొకని బంధించుకొని వచ్చుచుండెను.

విజ:—మిత్రమా, యిదియేమి ?

మిత్రుడు:—మాంత్రికులు!

విజ:—లోపల నొకదారుణము!

మిత్రుడు:—అంతయు, ఆ పాపాత్ముని దుండగము.

విజ:—దేవి ప్రసన్నయై మనల రక్షించినది.

మిత్రు:—జయ, దేవీ, జయ !! వారిద్దఱు దేవికి నమస్కరించిరి.

మిత్రు:—తాను పట్టుకొనిన పురుషునిఁ జూచి

ఓయీ ; నీ వెవరవు ?

పు:—భయముచే గడగడవడఁకుచు "మహాప్రభూ రక్షింపుడు !"

విజ:—భయఁములేదు. ఉన్నదానిని జెప్పుము. నిజము సెప్పినచో నిన్ను మన్నింతుము.

పు:—అయ్యా! ఇదిగో చిత్తగింపుడు. వీటివలన నన్నివిషయములు దెలియును. ప్రభువులను సేవించువారమగుటచే వారియాజ్ఞానుసారముగ నెంతటి పాపకార్యములయినఁ జేయవలయును. లేకున్న పొట్టపూడదు. అని తనచొక్కాజేబునందున్న కొన్ని కాగితముల వారి కొసంగెను.

వా రా జాబుల భద్రపఱుచుకొని వానిఁజూచి

ఓ యీూ? నిజము జెప్పితివి గాన నిన్నిఁక నేమియుఁ జేయము. నీ సంగతి విచారించునంతవఱకు నీవు మా రక్షణముననే యుండవలయును.

పురు:——చి_త్తము.

అంత వా రిద్దఱు దేవికి నమస్కరించి యా పురుషుని వెంటబెట్టుకొని పట్టణములోని కేగిరి.

# ఇరువదియవ ప్రకరణము

## అనుతాపము

అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫలమశ్నుతే.॥
మనుజునకు పుణ్యముగాని పాపముగాని యధికమైనపుడు దైవము తత్ఫలముల నిహలోకముననే యనుభవింపజేయును. పుణ్యమధికమగువారికి నింద్రాధిపత్యముగాని బ్రహ్మపదవిగాని యొసంగవలసెనేని యిఁక బ్రహ్మాదిదేవతల యాధిక్యత యేమున్నది. అటులే, దేహికి పాపములుగూడ ప్రబలమగుచో నిఁక వానికి క్రొత్త నరకములుగూడ సృష్టించవలసియుండును. పాపములు ప్రబలనిచ్చి వానిని యొక్కటేమారు పునరావృత్తి రహితములగు ఘోరనరక కూపములఁద్రోసి యాపాపి యాతనలనందుచుండ దయామయుండగు నీశ్వరుఁడు అతనికష్టములంజూచుచు నుండజాలఁడు. గాన మనుజునికి పాపబుద్ధి ప్రబలుటతోడనే ఆశాపాశము లభివృద్ధినొందుటతోడనే, పాపపుణ్య పరిశీలనాజ్ఞానము నశించుటతోడనే ఈర్ష్యాసూయ లినుమడించగనే సజ్జనులబాధింప సమకట్టుటతోడనే దైవము వానికిఁదగు పాపఫలంబొసంగును. ఇఁక వానిప్రయత్నములన్నియు వ్యర్థమగును. ఆశలడుగంటును. ఈర్ష్యాసూయ లింకిపోవును. ఇఁకనేమున్నది!! తానొనర్చిన పాపకార్యములకై పరితపించును. "అయ్యోదైవమా!! యెంతటి పాపమొనర్చితిని. ఆపాపములకుఁదగు ఫలమందితిని. ఇహ లోకమున యిట్టికష్ట

ములం గుములుచుంటిని. ఇంక పరమున నెంత యనుభవింప వలసియున్నదో! భగవంతుఁడా ఇఁక నాపాపములకు తుది లేదా? ఓ జగన్నాథా నన్ను పునీతునిజేయవా? నన్నీపరితాపానలమునుండి యావలఁజేర్చి కాపాడవా!" యని పలువిధముల తనయకృత్యములందలంచి దైవమునువేడుకొనును. ఆ భావనా దివ్యజ్యోతియే యాతని పాపాంధకారములను భస్మీపటల మొనర్చును. ఆపవిత్రక్షణమే యాతని జన్మకాలపరమావధియం దుత్తమమైనది. ఆక్షణముననే యాతనిజన్మ పవిత్రమగును. ఆనిమిషముననే దైవమునకు వానియందపారకృపఁ గల్గును. ఇఁక వాని మనస్తాపములు శమించును. మనస్సునకు శాంతిగల్గును. వాని జన్మసార్థకమగును.

కల్యాణపుర రాజమందిరమునందలి ప్రత్యేకభవనమున సుదర్శనుఁ డొంటిగా నొకకుర్చీలోఁ గూరుచుండి తనలో నేమేమియో యోచించుకొనుచుండెను. ఇదివఱకు తనమోమున అహంకారభావమును చూపులలో చురచురయుఁగల్గి చూచువారి కప్రసన్నముగా నగపడుచుండెడిది. ఇపుడట్లుగాదు. అతని మోము వాడి దీనభావము గన్పట్టుచుండెను. కన్ను లశ్రుపూరితములై యెఱ్ఱవడియుండెను. సహింపరాని మనస్తాపమున హృదయము చలింపుచుండ మాటిమాటికి వేడినిట్టూర్పులు విడుచుచుండెను. అతఁడవివేకమున మున్ను తాఁజేసిన యకార్యములందలఁపోయసాగెను. "అయ్యో దైవమా అవివేకినై యెంతటి కార్యము లొనర్చితిని. దుర్మార్గుఁడగు గజపతి కుత్సితంపు స్నేహము నిజమైనదని నమ్మి కొండనుదాకు తగరువలెఁ గొలది

సైన్యములతో నీవిక్రమసింహునితో సమరమొనర్చి వీరిచే పట్టుబడితిని. దగ్గఱబంధుగుడగు నీవిక్రమసింహునిపై నిష్కారణముగా నసూయఁగొంటిని. బంధుగులతో వైరమూనుట పాడిగాదని పలుతెఱంగులు హితోపదేశమొనర్చిన నాముద్దు కుమారుని సద్బోధనను వినక వానిపై యాగ్రహించి దేశము నుండి వెడల నడిపించితిని. హా! యిఁక నేనీజన్మంబున వానిం జూడఁగల్గుదునా అయ్యో! కుమారా! నా కుచేష్టితములకురోసి మీయమ్మతోనైనంజెప్పక యేదేశములకో ఏగి కడగండ్లు బడుచుంటివిగదా! హా! పుత్రఘాతకుఁడనైతిని. హా! సాధ్వీ, సుశీలా! అసూయాపిశాచగ్రస్తుఁడనై నీ ముద్దుబిడ్డకు నీకు వియోగము గల్గించితిని. నీవు వత్సమును బాసిన గోవువలె నిరంతరమును వాపోవుచు కృశించుచుండ కఠిన చిత్తుఁడనై చూచుచు లెక్కసేయనైతిని. మొదలే పుత్రవియోగమున కృశించుచున్న నీకు గోరుచుట్టుపై రోకటిపోటువలె పుత్రికా వియోగముగూడఁ గల్గినది. ఇఁక నెట్లు సహింతువు. అక్కటా నాముద్దుకూనా, అరవిందా! నేనెంతమందభాగ్యుఁడను. నీవానాఁడు 'నాయనా, నే నా గజపతిని వరింపను. వాఁడు గోముఖవ్యాఘ్రము. అదను చూచి మనలను మనరాజ్యమును గూడ పొట్టఁబెట్టుకొను'నని చెప్పిననీతి బృహస్పతి నీతియే గదా? వినక చెడితిని నిన్ను విక్రమసింహుఁ డపహరించెనని మూఢుఁడనై యాతనిపై కత్తికట్టితి: తగిన ఫలమందితిని. నిన్నా దురాత్ముఁ డపహరించెనని యిచ్చట వినినదిమొదలు నాయొడలు నీరై పోవుచున్నది. ఏమి సేయుదు, జీవన్మృతుండ

నైతివి. నీ వాతని మనోవాక్కాయ కర్మంబుల వరింపవు. ఆ పాపి బలాత్కరించుచో నీ యాయుధ పరిశ్రమ సార్థక మొనర్చుకొని వీరవనితవై వీరస్వర్గమభిలషింతువు. అయ్యో పుత్రికా రత్నమా! దైవము నీ యాపదఁ బాపవలయును. అయ్యో? బిడ్డా వాసంతికా! తల్లిదండ్రులులేని బిడ్డను కడు గారాబమున బెంచి పెద్దచేసి నా కుమారునకుఁ బరిణయ మొనర్చుకొని వర్ధమానపుర రాజ్యలక్ష్మివలె మాయింటనుండు నిను కన్నులారఁ గాంచవలయునను కొండంత యాసతో నుంటిని. ఈ యనర్థములలోఁ బడి నీవెచ్చట యేయాపదల పాలైతివో గదా! హా! నా యాసలన్నియు నడుగంటినవి. ఇన్నియు నా యవివేకముననే యిట్లు విపరీతముగాఁ బరిణమించినవి. నన్ను సేనలతో పురముదాటనిచ్చి గజపతి మాతని సేనానినంపి నా పట్టణము నాక్రమించెనని నిన్న విక్రమసింహుఁ డనియెను. అన్నియుఁ బోయినవి. అయ్యో! దేవీ! సుశీలా! యిపుడు నీ వేయడవులఁ గలుసుకొని పోయితివో గదా! ఒక వేళ నా పాపాత్ములచేఁ బట్టుబడిన నెట్లు తప్పించుకొనఁగలవో గదా. ఓ పాంచాలీ మానరక్షకా! నా సుశీల శత్రువులచేఁ బరాభవింపఁ బడకుండ కాపాడుము" అని యాతఁ డెలుగెత్తి దేవునిగూర్చి మొఱలిడసాగెను.

ఇంతలో విక్రమసింహు డాభవనమునఁ బ్రవేశించి యందొక కుర్చీపై నాసీనుఁడయ్యెను. సుదర్శనుఁడాతనిఁజూచి యధోవదనుఁ డయ్యెను. విక్రమసింహుఁ డటులే కొంతసేపటివఱకు మౌనమున నుండి,

"సుదర్శనా ! దైవసంకల్పముల కెవరేమి సేయఁగలరు. గడచినదానికై చింతింపకుము." అనెను. దుఃఖపీడితులగు వారికెవ్వరైన వచ్చి సమాశ్వాస వచనములఁ బల్కినచో నా విచార మతిశయించుట స్వభావము. సుదర్శనుఁ కాయాశ్వాస వచనములు విన్నతోడనే కన్నులనుండి దుఃఖాశ్రువులు ప్రవహింప సాగెను. అతడేమియుఁ బలుకలేదు.

విక్ర:—సుదర్శనా ! కష్టములు కాపురములు జేయవు. ఊరకే చింతింపకుము .

సు:—నాయకార్యములవలన తీఱనికష్టములే గల్గినవి. కుటుంబమంతయు దేశములపాలైనది. రాజ్యము దురాత్ములచేఁ జిక్కినది. ఇఁక నివి తీఱుటగూడనా !

విక్ర:—ధైర్యమూని మనసు నిష్కల్మష మొనర్చు కొని కార్యమును సాధించినచో నన్నికష్టములు దీఱును.

సుద:—నా మనసు నిష్కల్మషమే యైనది. అయినను ఎవరి సాహాయ్యమున నా శత్రువుల సాధింతును.

విక్ర.—సుదర్శనా ! నీ వారమగు మేమందఱముండ లేదా !

సుదర్శనుని కాతని సౌహార్దమున కచ్చెరువు తోఁచెను. ఇట్టి సద్బంధునియం దసూయవహించి చేయరాని యపకారము లొనర్పఁ బూనిన తన యవివేకమునకుఁ దన్ను తాను నిందించి కొనియెను. మరల విక్రమసింహునివైపు చూచి :

అయ్యా! ప్రాణబంధువగు నీపై మోపరానినిందల మోపి, చేయరాని యపకారములు చేసి, తుదకు మీచే పట్టుఁ

బడి దురాత్ములచే రాజ్యము గోల్పడి యిపుడు బిడియము విడిచి మరల నీ సాయ మెట్లపేక్షింతును. మీరెట్లంగీకరింతురు ?

విక్ర:—సుదర్శనా! దైవదుర్విపాకమున కెవరేమి సేయుదురు. విధివైపరీత్యమున మనలో మనకిట్టి విపరీతములు గల్గె. ఇఁక నవియన్నియు మనస్సునం దుంచుకొనరాదు.

సుద:—రాజా! నేను మీసహాయమున నావిశ్వాసఘాతకుల జయించి మరల నారాజ్యంబు గైకొనినను దాని నెవ్వరనుభవింతురు.

విక్ర:—నీ కుటుంబము.

సుద:—కన్న కుమారుని కానలపాలు చేసితిని. అనుంగు కూతురు దుష్టులచేఁజిక్కి యాపదలపాలైనది.

విక్ర:—వారికై నీవు చింతింపవలదు. ఆ దురాత్ముని సమరమున నిర్జించి నీ ముద్దుకూతురిని దెచ్చి నీ కొసంగువాఁడ. నీ తనయుఁ డశోకుండుగూడ నెచ్చటనో కుశలియైయే యుండును.

సుద:—ఆ! నాకట్టి భాగ్య మబ్బునా. నే బ్రతికి యుండగా నా ముద్దుకుమారుని కన్నులార గాంచువాడనా!! యనునప్పటికి సుదర్శనునికి పట్టరాని దుఃఖమువచ్చెను. పాపము దయాళుఁడగు విక్రమసింహుని మనసు కరిగిపోయెను.

సుదర్శనా! అధైర్యపడకుము. మనయశోకుఁడు క్షేమముగానే యున్నాడు. ఇఁక వాని జాడలరయుదము.

సుద:—సుఖముగానుండినట్లయిన వానిజాడయైనఁ దెలియకుండునా.

విక్ర:—దానికి బలమగు కారణములుండుటచే నాతఁడు ప్రచ్ఛన్నుఁడై యుండవచ్చును. అతనిపైఁగూడ నా దురాత్ముఁడు కఠినములగు శాసనములం జేసియున్నాఁడు. అని తనయొద్దనుండి కొన్ని యుత్తరములం దీసి యాతని కొసంగెను. సుదర్శనుఁడాయుత్తరముల సాంతముగాఁ జదివికొని 'హా!' యని యొక్క నిట్టూర్పు విడిచి కుర్చీపైఁ బడిపోయెను. విక్రమసింహుఁడాతని నోదార్చి "సుదర్శనా! భయపడవలదు." అనెను.

సుద.—అయ్యో! నిరపరాధియగు నాకుమారుఁడు వారికేమి ద్రోహమొనర్చెను.

విక్ర:—అతఁడు జీవించియున్నచో వర్ధమానపురమును వాసంతికయును నాతనికి దక్కుట కష్టమని.

సుద:—హా! వాసంతికకుఁ గూడ ననిష్టముసేయ దలంచిరా!! అనాథయగు నామె యిఁక నెచ్చట బ్రతుకఁగలదు హా! సుశీలా నేను మిమ్మెట్లు రక్షింపగలను.

విక్ర:—భయములేదు. వారు సురక్షితులే. ఆ వాసంతిక కడు చురుకైనదిగదా. తన మానప్రాణములఁ గాపాడుకొనుచు, అదనువేచి శత్రువులపై పగఁదీర్చి వర్ధమానపుర రాజ్యముఁగూడ నిలువబెట్టునంతటి సమర్థురాలు.

సుద:—హా! దురాత్మా, గజపతి, ప్రాణసమానులగు నా బంధుగులపై పగఁబూని కన్యనొసంగెదనని నీతో స్నేహమొనర్చినందులకు నా కుటుంబమున కనలముఁ దెచ్చి

పెట్టితివి. తనయును రాజ్యమును అపహరించుటయే గాక ని
పరాధియగు నా పుత్రునిఁగూడ సమయింప నెంచితివా ?
పాపములకు దైవము త్వరలో ఫలమొసంగుగాక.

విక్ర:—ఇఁకమీఁద మనస్సు నేకాగ్రమున నుంచుకొ
క్షత్రియోచితమగు పౌరుషమూని యీ దురాత్ముల మ
మడంచి నీ పరాభవమును బాపుకొనఁ బ్రయత్నింపుము.

సుద:—మహాత్మా, నీ ప్రబోధవచనములచే నా
వివేకము నశించినది. ఇఁక శత్రువులపై పగఁ దీర్చుకొన
బ్రయత్నించెద. అని మాటలాడుకొనుచు సాయంకాలమ
టచే వారు కాలోచిత కృత్యములఁ దీర్పనేగిరి.

# ఇరువదియొకటవ ప్రకరణము

## ఐంద్రజాలికుఁడు.

కొలఁదిరోజులనుండి కొండవీటి దుర్గమున కెవ్వఁడో యొక యైంద్రజాలికుండు వచ్చి తన ప్రభావముచే నద్భుత ప్రదర్శనములను జూపుచుండెను. అతఁడు మహామంత్రవేత్త యనియు స్వర్గమర్త్యపాతాళములలోనున్న విశేషములు గూడ తన మంత్రశక్తిచే నాకర్షించి యందఱకుఁ జూపఁగల డనియు నా పురమందలి జనులు చెప్పుకొనసాగిరి. దుర్గాధిపతియగు నారాయణ గజపతి కీ వార్త తెలిసినది. అతఁడిట్టి వినోదములనిన అన్నము నిద్రయుఁ గూడ వదిలి వీనితో ప్రొద్దులు పుచ్చు నుత్సాహముగలవాఁడు. అంతియేగాక తన యంతఃపురస్త్రీలకుఁ గూడ నిట్టి యద్భుత ప్రదర్శనములఁ జూపించి వారల సంతోషింపఁ జేయవలెనన్న యభిలాష గల వాఁడు. అందుకు తోడు అరవిందయును ఆతని నగరునకుఁ గొన్ని మాసములక్రిందటఁ గొనిరాఁబడెను. అతఁ డామెకిట్టి వినోదములఁ జూపియు ప్రియవస్తువులం గూర్చియు నామె యనుగ్రహము నొంద నిచ్ఛగలవాఁడు. ఏ విప్ర వినోదుఁడైనను ఏ గారడివాండ్రైనను, యే యైంద్ర జాలికులైనను నాతని రాణివాసములకడ వినోదములంజూపి బహుమానము లందకుండఁ బోవుటలేదు.

నాఁడు సాయంతనము, నాలుగు గంటలైనది. ఐంద్ర జాలికుఁడు తనతోడిమాంత్రికులతో నగరునకుఁ గొనిరా

బడెను. అతఁడు చాల చక్కనివాఁడు. మెఱుఁగుచామన చాయగల తన మేనినిండ విభూతినలందియుండెను. కను బొమల సందున కుంకుమయు కావును అడ్డముగా రేఖలు దీర్చియుండెను. అతఁడు పసపుపచ్చ వస్త్రములు ధరించి చేత నొక నాగబెత్తమును బట్టి తాటియాకుల మంత్రపుస్త కము నొకదానిని చంకలోఁ బెట్టుకొని రుద్రాక్షపేరులు మెడ నిండ వ్రేలాడ పార్వతీదేవికై హిమాలయ పర్వతమునందు వెదకికొనుచుఁ దిరుగుచున్న బాల శశాంకమౌళివలె నా సభకు వచ్చెను. అందొక యున్నతాసనముపై గజపతి గూరుచుండి యుండెను. వానిప్రక్కన యుచితాసనములపై మంత్రులు గౌరవనీయులగు రాజబంధువులు గూరుచుండి యుండిరి. తక్కిన యుద్యోగులు, దండనాయకులు, పౌరులు వారివారికి దగు మర్యాదల ప్రకార మందుఁగూరుచుండిరి. రాణివాస స్త్రీ లొక ప్రత్యేక భవనమున దాసీజనములతో వచ్చి యందలి కుర్చీలు సోఫాలపైఁ గూరుచుండిరి. అరవింద వారితో నుండలేదు. ఆమె యా ప్రక్క దివ్యసౌధమున వసించియున్నది. ఆ భవనమున క్రింద రత్నకంబళములు, పట్టు పరుపులు, కురిచీలు, సోఫాలు, విశేషముగానున్నవి. అందు దోమతెర మంచము చాందిని, పరుపు దిండ్లతో నమర్చబడిన దివ్యపర్యంకమున్నది. గులోబులు, లస్తర్లు మొదలగునవి వేలకువే లాభవనమున వ్రేలుచుండెను. దివ్యపరిమళయుతము లగు అగురుసాంబ్రాణి దూపము లందు ఘుమఘుమలాడు చుండెను. ఆ మందిరమున నగిషీపనులతో తయారుచేయబడిన

పంఖా యమర్పఁబడియుండెను. అరవిందకు పంఖా వేయువా రా మందిర మవ్వలనుండియే వేయవలయును. ఆమె యా భవనముఖద్వారమున నొక సోఫాలోఁ గూరుచుండి యిపుడు ప్రదర్శింపఁ బోవు వినోదములం దిలకింప నుత్సహించుచుండెను. గజపతి సభాభవన మామె మందిరము ప్రక్కనే యున్నది. అతఁ డప్పుడప్పు డామె భవనమువైపు తనదృష్టిఁ బఱపుచుండెను. ఆమె యా వినోదములఁ జూచి సంతసించు నపు డాముద్దుమోముఁ జూచి యాతఁ డానందింపం దలఁచి యుండెను.

ఐంద్రజాలికుండు సభా మధ్యమున తన కృష్ణాజినముఁ బఱచికొని యాసీనుఁడయ్యెను. ముందుముందుగా నాతఁడు బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, మహిషాసురమర్దని, మళయాల భగవతి మున్నగు విగ్రహముల మంత్రప్రభావమున నావిర్భవింపఁ జేసి సభవారి నానందింపఁ జేసెను. మఱియు పాములు, తేళ్లు, పక్షులు మొదలగు వానిని జేసి చూపించుచుండెను. ఇంతలో పిచ్చి దచ్చటికి వచ్చి యైంద్రజాలికుని యెదుట పద్మాసనము వేసికొని కూర్చుండి, 'బావా! నీకు మంత్రములు వచ్చునా! యే మేమి వినోదములఁ జూపెదవు.

ఐంద్ర:—నవ్వుచు అన్నియుఁ జూపెదను అనెను.

పిచ్చి:—"ఖగనాథుండమరేంద్రుని గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్ జగతీనాథుల చైద్యపక్షచరులన్ సాల్వాదులన్ గెల్చి భద్రగుఁడై చక్రి. మున్ను భీష్మకసుత"ను బలిమి నెత్తుకొని పోయిన యద్భుత ప్రదర్శనముం జూపింప

ఇంద్ర:—ఏలినవారు గోరినచో నటులే చూపించెదను.

పిచ్చి:—ఏలినవా రెవరు? నేనే యందఱిని యేలు చున్నాను. (సభవారందఱు నవ్వుచుండిరి. గజపతి యాపిచ్చి దానిమాటలకు నవ్వుచు నామెను జూచుచుండెను.)

ఇంద్ర:—నీ వాఁడుదానవుగదా! అందునను పిచ్చి దానవు. నీ వెవ్వరి నేలఁగలవు.

పిచ్చిది:—నే నాఁడుదాననా? నేనాఁడుదాననా? అట్ల యిన బావా నీ మంత్రముచే నన్ను మగవానిని జేయఁ గలవా? అవ్వల నా పెళ్లికి ముందు చేయించుకొందును.

గజ:—ఉన్మాదినీ, నీ సమాచార మావల జూచుకొం దము. ఇప్పుడా వినోదముల జరుగనిమ్ము. నీ వేగి మీా రాణి యొద్దఁ గూర్చుండుము.

పిచ్చిది:—నాసంగతి మీారవ్వల విచారింతురా? మీాసంగతిగూడ నేనవ్వల విచారించుకొనెదనులెండు. నాకీ వినోదములు వలదు ఏమీావలదు. నేను నారత్నమును జూచు కొనియెదనని, యాపిచ్చి దచ్చటనుండిలేచి నాల్గువైపుల వెఱ్ఱి వెఱ్ఱిచూపులుచూచుచు అరవింద భవనము లోనికేగెను. ఆమెకీ యున్మాదిని వినోదములన్నచో నేవినోదము లక్కఱ లేదు. పిచ్చిది వచ్చుటతోడనే అరవింద నవ్వుచు నామెతో లోనికరిగి బాలికయగుటచే కొంతసేపామెతో వినోదించి మరల నింద్రజాలముం జూచుటకై భవనద్వారమునొద్దికి వచ్చి కురిచీలోఁ గూరుచుండెను. పిచ్చిదచ్చటఁ గొంతసేపుండి యేమేమో గొణగసాగెను.

గజపతి:—ఉన్మాదినీ, కొంచముసేపు ఊరకుండుము. అట్లు నీలోనీవెందులకు మాట్లాడుకొందువు. ఇందుకేగదా నిన్నందఱు పిచ్చిదనుచున్నారు.

పిచ్చిది:—అయ్యో నేను పిచ్చిదాననా? మీరందఱు నాకు పిచ్చివారివలె నగపడుచున్నారు. ఇంతమంది పిచ్చివారిలో నేనెట్లుందును. అయ్యో పిచ్చివారలారా మిమ్ముఁజూచిన నాకు భయమగుచున్నది. నేఁబోయి మీపిచ్చికిఁదగు మందు తెచ్చి వేసెదను. ఇఁక నేనిచట నుండజాల నుండజాలనని యేమేమో వెఱ్ఱివెఱ్ఱి మాటలాడుచు పిచ్చిదఁటనుండి వెడలిపోయెను.

ఐంద్రజాలికుఁడు తన మంత్రతంత్రయంత్రప్రభావముల వలన నచ్చటివారికి స్వర్గము, వైకుంఠము, కైలాసము, సత్యలోకము, సముద్రమథనము, మోహిన్యవతారము, దేవాసురయుద్ధము, గంగావతరణము మొదలగు నద్భుత ప్రదర్శనములం జూపెను.

సభవారంతయు నాప్రదర్శనముల నద్భుతముగాఁ జూచుచుండిరి. మరల నైంద్రజాలికుఁడు తన మంత్రపుస్తకమును మూఁడుమాఱులు నేలకుఁగొట్టి ఆకాశమువైపుజూచి "ఆవ్ భగవతి, రాజరాజేశ్వరీ" యనిచెప్పుచు "సభికులారా, యిదిగో స్వర్గమునుండి యింద్రుని సైన్యములు వచ్చుచున్నవి. నిబ్బరమూని చూచుచుండు"డని హెచ్చరించెను. గజపతి మున్నగు ప్రేక్షకులందఱును అత్యుత్సాహముతో నెదురు చూచుచుండిరి. ఇంతలోనొక యాశ్వికవీరుఁడశ్వారూఢుఁడై

చేత కరవాలముధరించి చరచర గజపతియున్న యాసనము ద్దికివచ్చి యశ్వమునుదిగి యొకచీటి నాతనిచేతికొసంగెను. గజపతి యాశ్చర్యముతో నాయుత్తరమును విప్పిచూడ నందిట్లున్నది—"మేము సర్వసైన్యములతో యుద్ధమునకు వచ్చుచున్నాము. మీరెల్లరు సమరమునకు సిద్ధముగనుండుఁడు. సర్వాధిపతి" యని యుండెను.

గజపతి యాతని మంత్రప్రభావమున కచ్చెరు వందుచుండెను. అటులే మఱియొక యాశ్వికవీరుఁడువచ్చి చీటి నిచ్చెను. దానియందుగూడ నిటులేయున్నది. మఱునిముస మున పదిమంది యవ్వలనూర్వురు ఆవెనుక వేయిమంది విచ్చుకత్తులతో సభాభవనము నిండిపోయిరి. ఇంకను సైన్య ములు వచ్చుచునేయున్నవి. తెఱిపిలేదు. సభవారందఱు నిశ్చేష్టులై యాయింద్రజాలమును జూచుచుండిరి. పట్టణ మంతయు సైన్యములతో నిండిపోయినది. ఎందుఁజూచినను కోలాహలమధికమయ్యెను. రాణివాసస్త్రీలా కోలాహలమును జూచి భయమంది తమ కవాటములను బంధించిరి. అరవింద యీదృశ్యమునకు భయమంది యుండునేమోయని గజపతి యామె భవనమునకు వచ్చిచూచెను, అందామెలేదు. పిడుగు వలె యొకరాజపుత్రవీరుఁడా భవనమునుండి యవ్వలకువచ్చి గజపతిపైఁబడి యాతనిఁబట్టిబంధించెను. అదాటున తనపైఁబడి పట్టిబంధించిన యావీరుని పట్టునుండి తప్పించుకొనఁజాలక గజపతి వెఱగంది నాల్గువైపులంజూచెను. అప్పుడే యావింత క్రొత్తసైనికులచేత, తనమంత్రులు దండనాధులు మున్నగు

వారందఱు బంధింపఁబడియుండిరి. పట్టణములోనున్న మఱి కొందఱు సైనికులీ కోలాహలముంజూచి యిదియేమో వింతగానున్నది. నిక్కముగా నిది యింద్రజాల మెంతమా త్రముగాదనితలంచి శస్త్రాగారములకుఁ బరువెత్తు నంతకు మున్నె యభియాతులు వారి నరికట్టియుండిరి. అయపార సేనాసాగరములో నిరాయుధులగు వారేమిచేయఁజాలక లోఁబడిపోయిరి. గజపతి యేమియుఁ జేయఁజాలక అరవింద యేమైనదని నాల్గువైపులుచూచుచు నిది యింద్రజాలముగాదా కాకున్న మఱేమి. అరవింద యేమైనదని యాగదివైపుఁ జూచుచుండెను. ఇంతలో విజయసింహుఁడు కృపాణపాణియై అచ్చటికివచ్చి గజపతిని బంధించిన కుమారునిజూచి "మిత్ర మా, అశోకుఁడా, శత్రువులందఱు బంధింపఁబడిరి. తక్కుఁ గల వీరిసైన్యములు మనకు లోఁబడిరి. ఈకొండవీఁడు మనకు స్వాధీనమైనది. ఇఁక నీదురాత్ములనందఱిని బంధించి మన పురమునకుఁ దీసికొని పోవలయును. పల్లకుల సిద్ధము చేయించితివా?

అశో:—"అన్నియును సిద్ధమైనవి. ఇఁక పట్టుబడిన వీరిని పురము దాటింపవలసిదే యవశేషము."

గజపతి యామాటలు విననప్పటి కది యింద్రజాలము గాదనియు, ఇదియంతయు విజయసింహుని మోసమనియుఁ దెలిసికొనెను. తోడనే వానిమోము కనులు ఎఱ్ఱబారి క్రోధా వేగమున మేను కంపింపసాగెను. అయినను బోనులోఁ జిక్కిన పులివలె నాతఁడు వారినేమియుఁ జేయఁజాలక విజయసింహునిఁ

జూచి "ఓరీ, దురాత్మా ఇట్టి మోసముచే మమ్ము జయింపఁ బూనుట రాజధర్మమటరా?"

విజ'—ఓరి మూఢుడా నీయెత్తున కిది పైయెత్తు

గజ:—మీయెడల నేనేమి మోసమొనర్చితిని.

విజ:-ఓరీ, కుమతీ, మాయరవిందను అపహరింపలేదా.

గజ:—"నే నామెను పరిణయమాడఁ దలంచితిని."

విజ:—ఛీఁ దురాత్మా, నోరుమూయుము. రమ్ము మావెంట !! మిత్రమా, యిఁక వీరిని పురమునకు జాగ్రత్తగా కొనిపొమ్ము. నేనీమార్గమునఁ జేయందగు కట్టుదిట్టములొనర్చి త్వరలో వచ్చెదను.

# ఇరువది రెండవ ప్రకరణము

## ఇరావతి

నారాయణగజపతియాజ్ఞవలన సుదర్శనుని వంచించి వర్ధమానపురము నపహరించిన పాపాత్ముఁడగు చండసేను నకు 'ఇరావతి' యను నంతఃపుర మహిషిగలఁదు. ఆమె యొక బీదరాజుకూతురు. మంచి చక్కనిది. చిన్ననాఁడు పేదవారగు కన్నవారింట సామాన్యులతోఁ బాటు కష్టపడుచు కాలము గడిపినది. అవ్వల తన యదృష్టమువలనను రూపము వలనను గజపతి సర్వసేనానియగు చండసేనునకు భార్యయై నాటివారిలో గౌరవమును బొందినది. ఆ యదృష్ట ప్రభావముననే యిపుడు వర్ధమానపుర రాణికూడనైనది. ఆమె చిన్న నాఁడు పుట్టింటివారి పేదఱికమున నచ్చట తానుబడిన కష్ట ములను మఱచిపోయినది. తాను జన్మించినదిమొద లిట్టి యైశ్వర్యములతోడనే తులఁదూగుచుంటినని తలంచి గర్వించు చుండును. తనకన్న చక్కనివారును అదృష్టవంతురాండ్రును లేరని యామె తలంపు. ఒకవేళ నట్టివా రున్నారని విన్నను, కన్నను, వారిపై యసూయ. ఆమె కన్ని వైభవములు నదృష్ట వశమున లభించినవి గాని యొకా నొక కారణమున నీ విభ వము లన్నియు నామెకంత సంతోషదాయకములుగా నుండుట లేదు.

చండసేనుఁడు స్త్రీలోలుఁడు. తనకంటికింపగు వనిత కనపడెనేని యది కులకాంతయైనను బలిమిచేఁ గాని యుపహా

రించిగాని! తెచ్చుకొని తననగరున నుంచుకొనఁదలంచువాఁడు. వేయేల, అన్ని గుణములయందును, అతఁడు కలియుగ రావణా సురుఁడే. ఇట్టి స్వభావముగల భర్త తనపై యెంతమక్కువఁ జూపుచు మన్నించుచున్నను ఇవియన్నియు యేవేళ నే సుందరి పాలగునో యే యువతిని మోహించి తననాథుఁడు తనపైఁ గల యనురాగము వీడునో యే క్షణమున తనసహమంతరపు సిరి సంపదాయము గల్గునో యని యామె నిరంతరము పరిత పించుచుండును. తన పరిచారికలు గాని పట్టణములోని సుంద రులుగాని తనకంటెఁబడిరేని వారింజూచి "యయ్యో"యని యలమటఁ నొందుచుండును. అంతఃపురమున దాసీజనములలో నెవ్వతెయైన రూపవతిగా నుండినచో నామె దానిపై నేదియో యొక నిందను మోపి యటనుండి వెడలఁగొట్టుచుండును. అమె కహర్నిశము లదియే యాందోళనము. తనమగని వలలో వేసికొనుటకై యామె క్షణమున కొకతీరుగా నలంకరించు కొనుచు చేయని శృంగారము, మాయనిమడతగా తనభాగ్య ముల వ్యయపఱచుకొనుచుండెను. ఆమెకు మఱికొన్ని దుర్ల క్షణములు గలవు. వానిలో మొదటిది భర్తవలెనే పానా సక్తిరె. అందువలన నామె కనులెఱ్ఱబారి యెల్లపుడు మత్తుచే నిర్వ్యాపారముగా పడియుండి పై జెప్పిన యనుమానపిశాచ పీడితయై యింటికి మింటికి సూత్రములం బన్నుచుండును. ఈ సూత్రములేగదా కాలపాశములై తుదకు వారి ప్రాణములఁ దీయును.

నాఁటి సాయంతనము నాలుగుగంటలైనది. ఆమె యింద్రభవనముంబోలిన తన పడకటింట నతిసుందర మృదుల పర్యంకముపై నున్నది. ఆయింట నాల్గువైపుల నిలువుటద్దములు, శృంగారభావ విలసనములగు శకుంతలా దుష్యంతులు, సుభద్రార్జునీయము, ఊర్వశీ పురూరవులు, రంభానలకూబరులు, తారాశశాంకము, ఇంద్రాహల్యము, శివునిదారుకావనవిహారము, గోపికా వస్త్రాపహరణము, రాసక్రీడ, రాధాకృష్ణ విలాసములు మొదలగు శృంగారపటము లమర్పఁబడి యున్నవి. ఆశయ్యాభవనమునందలి యగరు, సాంబ్రాణి ధూపములు ఘ్రాణేంద్రియములకు హాయిఁ గొల్పుచుండెను. అందు నేలంయుతయు చలువరాళ్లు బఱచియున్నవి. వానిపై రంగురంగుల రత్నకంబళములఁ బఱచియుంచిరి. అటనున్న దోమతెర' చాందినీమంచముపై హంసతూలపు లమర్పఁబడి యున్నవి. దానిపై మిసమిసల వర్ణముగల మొకమలు పట్టు సొరగుడందెల్లా నానుకొని యర్ధశాయినిగా నామెరావతి శయనించియుండెను. ఆమె నాకుపచ్చపట్టు జరీచీరఁగట్టుకొని సన్నని తెల్లవలిపెమువంటి రైకఁ దొడఁగుకొని విలువలేని వజ్రంపునగ లలంకరించుకొని చేత నొక యద్దముఁబట్టుకొని దానిలో తనప్రతిబింబమును జూచుకొనుచుండెను. ఆమె కచ్చటి పరిచారికలు కొందఱు పాదములొత్తుచు పంకాలు వేయుచు, ఇచ్చకువచ్చు మెరమెచ్చు ముచ్చటలఁజెప్పుచు నతివినయములఁ గనపఱచుచు నామె విభవములకు మఱింత వన్నెఁ దెచ్చుచుండిరి.

ఇంతలో నొక ప్రతీహారిణి యొకసుందరాంగిని వెంటఁ బెట్టుకొని వచ్చినది. ఆమె చక్కనిచుక్క. వయసు పదు నెనిమిది యేండ్లుండును. దేహచ్ఛాయ తొలకరిమించురీతి నున్నది. గోధుమవన్నెగల సన్నని జరీచీర కుచ్చెళ్ళు బొటన వ్రేళ్లవఱకు జీరాడునట్లు కట్టుకొని రోజావన్నెసరిగంచు పూలరవికె తొడఁగికొని యొంటినిండ బంగారు కెంపుల రవల నగలు తళతళ మెఱయుచుండ రక్కసులవంచించి యమృత మంతయు నాదితేయులకొసంగి వచ్చిన మాయామోహిని వలెనున్నది. ప్రతీహారిణి యా సుందరిని ఐరావతికడకుఁ దెచ్చి, దేవీ, ఈక్రొత్తవనితను రాజుగారు మీయొద్ద నుంచుకొమ్మని చెప్పిపంపిరి అనెను. ఐరావతి యామెవైపుజూచి కిచ్చు పోయెను. కొంతపడికి ప్రతీహారిణినిజూచి "ఎందులకు" అనెను.

ప్రతీహారిణి:—ఈమె వీణె చక్కగా వాయించఁగలఁ దఁట. హరికథలు చెప్పునఁట. చిత్రలేఖనయం దీమె కెవ్వరు సాటిరారఁట. గాన, నీమెను మన యంతఃపురమున నుంచుకొని తమ కీమెయొద్ద సంగీతవిద్య నేర్పింపవలయునని ప్రభువుగా రీమెను తమయొద్దికంపిరి.

ఆమె హృదయమున పిడుగుపడినట్లయ్యెను. తన యను మానములకుఁ దగినట్లే పైన మీావిధముగా సన్నివేశములు గూడ గల్పించుచున్నారు. భర్త తనకుభయపడి యీా విధము లగు నెపములఁ గల్పించి యట్టి జవ్వనులను నగరులోనికిఁ జేర్చి తన యభీష్టము నెఱవేర్చుకొనునని యామె యెంచు గును. అట్లుఁటేఁగియే యామె లోలోన క్రుంగిపోవుచుండెను.

అందునను, ఇట్టి చక్కని సుందరిని జూచెనేని యిఁక విడుచునా!! ఇఁక నీమె యాతనికి ప్రాణసమానయగును గాఁబోలు. అయిన నాగతి యేమగునో గదా! ఆమె యీ విధముగాఁ దలపోసికొని యామెవైపు చురచురఁ జూచెను. ఆమె వామకరపల్లవము కాంచీప్రదేశమునందుంచి దక్షిణ హస్తము వామకరము మణిబంధమున నిల్పి మన్మథుఁ డంబుసుపోకకై విలాసముగా నుంచుకొనిన రతివిగ్రహమువలె నిలిచియుండెను. ఆ విలాసవతిని జూచినతోడనే దేవికి ఒడలు మండిపోయెను. ఈర్ష్యాసూయలు ముంచివైచెను. తన సౌభాగ్య మహాయోగ పదవికి ఒక రాహుగ్రహముగా దాపరించినదని మొగము చిట్లించెను. ఎట్లున్నను రాజుమాట కెదురాడరాఁదు. అతఁ డేవిధముచేసినైన తనయభీష్టము నెఱవేర్చుకొనక మానఁడు. ఇఁక దీనిని మాయోపాయములచే నైన నచ్చటినుండి తఱిమివేయవలెనని యూహించి యామె యా సుందరిని జూచి,

"నీ వెవ్వతెవు?"

సుందరి:—మాది సైరంధ్రీకులము.

దేవి:—ఏ దేశము?

సుం:—కన్నడదేశము.

దేవి:—నీపేరేమి?

సుం:—నాపేరు సుందరి.

దేవి:—మీఁదియే వృత్తి.

సుం:—అమ్మా, మేము హరికథలఁజెప్పుదుము. సభల యొద్ద సంగీతముపాడి గొప్పగొప్ప రాజులయొద్ద బహుమానములందియుంటిమి.

దేవి:—మీరసగా నెంతమంది ?

సుంద:—పదిమంది.

దేవి:—ఎచటనున్నారు ?

సుంద:—ఈ పురమునకు కొంతమందిమి వచ్చితిమి. మఱికొం దరు ప్రక్క-గ్రామములో నున్నారు.

దేవి:—మీవారిలో నీకు ముఖ్యబంధుగు లెవరైన నున్నారా ?

సుంద:—ఉన్నారు.

దేవి:—ఎవ్వరు.

సుంద:— నా ప్రియుఁడు.

దేవి:—పెండ్లి అయినదా ?

సుంద:—లేదు.

దేవి:—నిన్ను రాజుగా రెప్పుడు చూచిరి ?

సుంద:—నేఁడు మధ్యాహ్నము.

దేవి:—ఆయనయే నిన్నుఁటకుఁ బిలిపించిరా ?

సుంద:—అమ్మా నా సంగీత విద్యాపాండిత్యమున దొరవారిని మెప్పించి అందఱు ప్రభువులయొద్దవలెనే బహుమానములనంది మఱియొకపట్టణమున కేగవలయునని వచ్చితిని. ప్రభువువా రిట్టి సుందరులఁజూచినచో మోహించి తన

యంతఃపురమునకు రప్పించుకొనుట వాంఛకయని యిప్పు డెఱుగుచున్నాను.

దేవి:—అయిన నీ కిచ్చటనుండుట కిష్టములేదా ?

సుంద:—నా ప్రియుని జేరెదన.

దేవి:—రాజుగారి యాజ్ఞ నామోదించియే గదా యిచ్చట నుండవచ్చితివి.

సుంద:—అనుమోదించినటుల నటింపకున్నచో మానసముతో మమ్ము దాటిపోవనిత్తురా ?

దేవి:—అయిన నీ యభిప్రాయమేమి ?

సుంద:—ఇచ్చటనుండి యెటులైనను దప్పి నా ప్రియుని గలిసికొనవలయునని.

దేవి ప్రాణము కుదుటఁ బడినది. ఆమెహృదయము విశ్వాసము, దయ, స్నేహము గల్గినది. ఎటులైనను నీవెను త్వరలో నిటనుండి దాటించుటయే మంచిదని తలంచినది. రాజొకవేళ నిన్నెనర్చి యడిగినచో నామె యెటకో చెప్పక పారిపోయినదని చెప్పి తప్పించుకొనవచ్చునని యూహించినది.

దేవి:—సుందరీ, అటులైన నొకయుపాయమున్నది. ఆ విధముగా నీ నగరుదాటి నీవారితోఁ గలిసిపొమ్ము.

సుందరి:—దేవీ అటులే నామానము గాపాడి మా వారితోఁ జేర్చి పుణ్యము గట్టుకొనుము.

దేవి:—సరియే, ఒకటి రెండు రోజులు నాయొద్ద నుండుము. అన్నాల సమయమరసి నిన్ను దాటింతును.

సుంద:—"అమ్మా! రాజుగారి దృష్టియంతయు నా మీఁదనే యుండుననని మీకుఁ దెలియునుగదా!! పురరక్షకులలో నెవ్వరికంట బడినను నన్ను విడువరు. రాజు మీయొద్దకు వచ్చినప్పుడు నన్ను మందిరాంతర్భాగమునందుంచి కాపాడుము. ఆయన నా ప్రస్తావము దెచ్చినచో నప్పటికిఁ దగు మాటఁజెప్పి యాయనను సమాధానపఱుపుము. నాయందు దయయుంచి కొలఁదిరోజులలో నన్ను నా ప్రియునితోఁ జేర్పింపుము." అని యామె దీనముగా వేఁడుకొనెను.

ఇరావతి కామెయెడ మంచి నమ్మకము మంచి దయయు గల్గినది. ఆమె యనుమానపిశాచ మామెయెడ నీవిధముగా తన ప్రభావము జూపింప దలఁచినది. అది మొదలుకొనియే యామె సుందరిని అంతఃపుర సౌధముల వెలుపలికి రానీయక అంతర్భాగముననేయుంచి వేయికన్నులఁ గాచుచు రాజుకంటబడిన నేవేళ కేప్రమాదమువచ్చునో యని జాగ్రత్తవహించి యుండెను. సుందరియు, తన కది దైవ సహాయమని తలంచుచు పురుషులకంటఁ బడక ఆమెయుండు మన్నచోట నుండి శ్రావ్యములగు పాటలవలనను వినోదములగు కథలవలనను ఇరావతిమనం బాకర్షించెను.

ఇట్లు రెండురోజులు జరిగినది. ఒకనాఁటి సాయంకాల మాఱుగంటలకు చండసేనుఁడు తనభార్య యంతఃపురమునకు వచ్చెను. ఇరావతితోనున్న సుందరి యాసవ్వడి నెఱింగి ముందుగనే మందిరాంతర్భాగమున కేగెను. రాజువచ్చి భార్యతో కొంతసేపు ముచ్చటించి ప్రసంగవశమున—

"మొన్నఁ నేఁబంపిన సుందరి యెచ్చట" నని యడిగెను.

ఆమె తన హృదయము మాటుబఱచుచు నీవిధముగాఁ జెప్పెను.

'ఆమెకు నిన్న మొదలు మాసముగోజులు వ్రతమొకటి కలదఁట. ఈరోజులలో పురుషులకంటఁబడరాదఁట. సభలకుఁ బోవదఁట. ఈ యంతఃపురమున నాకు వీణనేర్పుచుండునని చెప్పి నన్ను వేఁడుకొన్నది. అందులకు నేనంగీకరించితిని' రాజున కామెస్వభావము, బాగుగాఁ దెలియును. ఆ సుందరిని తన కంటఁ బడనీయకుండుట కిది యొకయుక్తియని యాతనికిఁ దెలియును. ఆమె యిచ్చటనే యుండును గదా! ఇఁక నీమె యుక్తులెందులకుఁ బనికివచ్చునని తలంచి యామెంజూచి

'సరియే, యామెనుమాత్ర మెచ్చటికినీ పోవనీయక కాపాడుచుండుము.'

అని చెప్పి యాతఁడచటనుండి వెడలిపోయెను.

నేఁటిగండము గడచిపోయినదిగదా యని, ఇరావతియు లోపలికేగెను. అంత సుందరి భక్తివినయములఁ బ్రకటించు భావములతో.

'అమ్మా ఈ విధముగానే నా మాన ప్రాణములఁ గాపాడుచు త్వరలో నన్నావలకు దాఁటింపుము. పతివ్రతా లలామవగు నీ కిదియే నమస్కారము.'

అని యా సుందరి యామెకు నమస్కరించెను. ఇరావతి కామెయెడ నెన్నడులేని ప్రసన్నతయు, విశ్వాసమును దయయుగల్గినవి.

'సుందరీ, భయమందకుము. పురుషులకంట బడనీయక నిన్నుఁ గాపాడుచు త్వరలో నావల దాఁటించుభారము నాది.' అని యభయమిచ్చి కలఁతలేని మనసుతో నామె కావలసినంత యాసవము గ్రోల మత్తెక్కి తన పర్యంకమున శయనించెను.

సుందరియు, నిరావతికి తనయందు గల్గిన విశ్వాసము వలన నిచ్చిన చనువువలన నా భవనమంతయుఁ దిరుగుచు నేమేమో సవరించుచుండెను. దాసీజనముల కామె నేమియు ననుటకు ధైర్యములేదు. ఆమె యా భవనమునంతయు కొంత సేపటులే సవరించి యిరావతి యాలంకారమంటపములోనికేగి తలుపులు వేసికొనియెను. అంటనున్న నిలువుటద్దము నొద్ద నిలిచి తలముడి విప్పెను. ఆ వెడద పెన్నెఱిగుంపులు, ముఖమను కళానిధికి భయపడి ఆమెవెనుక దాఁగినట్లు అతి నీలములై పిక్కలవరకు వ్రేలాడుచుండెను. ఆ వేణికి సంపెగ నూనె మెరుగుగారాచి దువ్వి అతినేర్పుగా నున్నని జడవైచి యొకవింత మెట్టని పట్టుదారమున బంధించి వ్రేలవైచెను. అచ్చటనున్న పన్నీటితో తన మోము చక్కగాఁ దుడిచికొని అప్పుడే వికసించిన పద్మమందున్న మధుబిందువువలె తన ముద్దునెమ్మొగమున కుంకుమచుక్క నలంకరించుకొనియెను. సోగకన్నుల కాటుకఁ దీర్చెనది. రోజాపువ్వు నొకదానిని జడయందుంచుకొనినదఁది. తెల్లనివలిపెమువంటి జరీచీరఁ గట్టుకొని యట్టి కంచుకమునేఁ దొడఁగికొని తాంబూలము వేసి యద్దమునందు తన ప్రతిబింబమును జూచుకొనియెను.

ఆహా! ఆజగన్మోహన రూపవిలాస వైభవమునకు ఆశ్చర్యమయ్యెను. ఆ మోహనప్రతిబింబము నటులే కొంత వఱకుఁ జూచుకొని తనలోతానే తలయూపుకొనియెను. ఆహా యిట్టి మోహనరూపమున నీ సమయమున నా పాపాత్మునియొద్ది కేగవచ్చునా! ఐననేమి. వాఁడు మధుపానమత్తుఁడు గదా! స్త్రీలోలుఁడగుటవలన నామాట కెదురాడఁడు. నే నీక్షణముననే యా మందునియొద్ది కేగి వానికంట దుమ్ముగొట్టి కార్యమును సాధించెద. అవ్వల వారు లేచియుందురు. అని తనలో తా నేమేమియో యోజించుకొని యామె నల్లని పట్టు శాలువ యొకటి మేలిముసుకుగా గప్పుకొని రాజమందిరాభిముఖియై వెడలిపోయెను.

రాత్రియెనిమిదిగంటలైనది. చండసేనుఁడు విశేషముగా మధుపానమొనర్చి మత్తెక్కి తనమేడపై వెన్నెలబయలున నొకకురిచీలో కూర్చొనియుండెను. వానికను లెఱ్ఱబడియున్నవి. ఒకరిద్దరు సేవకులు మాత్రమిపు డాతనియొద్ద మేడపైనుండిరి. ఇంతలో మేడమెట్లపై మెట్టెలచప్పుడయ్యెను. చండసేనుఁ డా వైపే చూచుచుండెను. సుందరి మేలిముసుకుతోవచ్చి యాతనియెదుట నిలిచినది. ఇంకనేమి— వానికి మోహము తలకెక్కినది. మేను పులకరించినది. దేవికిట్లు కనుగప్పి యామె తనయొద్దకు వచ్చినదోయని యచ్చెరువును సంతసమును గల్గినది. ఆతఁడతిప్రేమపూర్వకముగ, సుందరీ? యని సంబోధించెను.

సుందరి:—మహారాజా, చిత్తము.

చం:—(సంతోషమయ్యెను.) నీ విపుడెట్లు రావసతి గల్గినది.

సుందరి:—(నవ్వుచు) రాఁదలిచినచో నెటులైనను రావచ్చును.

చండసేనున కామెపై యెనలేని విశ్వాసము దయ ప్రేమగల్గినది. ఆతఁడు కైపునను మోహమునను తడఁబడుచు సుందరిని సమీపింపఁబోయెను. ఆమె యించుక వెనుకకరిగి

మహారాజా! కొన్నిరోజులు నిదానింపుము.

చం:—ఏల? నాయందు దయయుంచవా?

సుందరి:—రాజా, నాకు నెలరోజులు వ్రతముగలదు. అవ్వల నీకోర్కె నెఱవేఱును. క్షమింపుఁడు.

చం:—అయిన సరియే. నీమాట కెదురాడరాదు. ఇపుడేమో కార్యార్థినివై వచ్చినట్లున్నది.

సుం:—అవును, మహాప్రభూ.

చండ:—యోజింపనేల చెప్పుము.

సుంద:—చిత్తము. దేవరా? దేవిగారికి నాయం దించుక యనుమానమును అసూయయుఁ గల్గినట్లున్నది.

చండ:—ఉండవచ్చును. ఆమె నిన్నేమైన అనినదా.

సుంద:—లేఁదుగాని—

చండ:—సంకోచింపవలదు. నీ యభిప్రాయముఁ జెప్పుము. నెఱవేర్తును.

సుంద:—రాజా! తమదేవికి నాయందు గల్గియుండు

అనుమానము కోపము దెలిసికొనినదిమొదలు నాకు చాల భయమగుచున్నది.

చండ:—ఆమె నిన్నేమియుఁ జేయఁజాలదు. భీతిల్ల వలదు.

సుంద:—అట్లని యెట్లూరకుండఁగలను. దేవి సమాజ్ఞా వశవర్తులగు మీ పరిచారకపరిచారికాజనము నా కేదేని యెగ్గొనగూర్తురు. అందులకు భవదీయనామాంకితమగు నేదేని గుర్తు నాయొద్దనున్న నిఁకవారు నన్నేమియుఁ జేయఁజాలరు.

చండ:—సుందరీ, నీయిష్టమటులే యొసఁగెద. ఇఁక నామెవలని భయమువీడి సుఖముండుము. అనిచెప్ప వ్రేలనున్న సిక్కాయుంగరమును దీసి యామె కొసంగెను. ఆమె యా ముద్రికఁగైకొని కన్నులకద్దుకొని,

మహాప్రభూ, అనుగ్రహింపఁబడితిని. ఇఁక నాకు సెల వొసంగెదరా—నేఁగన్పించకున్న దేవి యనుమానించును.

చండ:—సరియే, సుందరీ, నీ ప్రతిసమాప్తియైన పిమ్మట నన్ననుగ్రహింతువుగదా?

సుంద:—మహారాజా నూతినీరు వెల్లువైపోవునా—సెలవిండు. త్వరలో దేవియొద్దకేగెద.

చండ:—అటులే పోయిరమ్ము. దయయుంచుము.

సుందరి ఆతనివద్ద సెలవుగైకొని వెడలిపోయెను.

# ఇరువదిమూడవ ప్రకరణము

## విజయము.

వర్ధమానపురము చుట్టును పెట్టనికోటవలె చిన్నకొండ గుట్టలుండెను. వాటిమధ్యనే యాపట్టణమున్నది. ఒక్క వైపున వానిసందున పెద్ద బలమగుగోడయు అభేద్యములగు ఇనుపతల్పులచే సమర్పఁబడియున్నది. మఱియొకవైపునుండి యాగుట్టు భేదించుకొని పురములోనికి చీమయైనను దూఱుటకు వీలులేదు. శత్రువులు రహస్యముగా వచ్చినను బహిరంగముగవచ్చినను బలమగు నాకోటతలుపుల భేదించుకొనియే పట్టణములోనికి రావలయును. ఆతల్పులను భేదింప నెంత ప్రయత్నమొనర్చినను చాలకాలముబట్టును. ఎంతబలవంతుఁడగు శత్రురాజైనను అపారములగు సేనలతో నాపురమును ముట్టడించి కొన్నిమాసములుండి పట్టణములోనికిఁ జొరవీలులేక పోవలసినదే!! పట్టణము చిన్నదైనను యద్భుతములగు కొండగుట్టలే కోటగానున్నకారణమున నాపురమెవ్వరు లోఁబఱచుకొనఁజాలకుండిరి. పాపాత్ముఁడగు చండసేనునికి మాయోపాయమున నీకోట స్వాధీనమై కొలఁదికాలమయ్యెను. ఆపురమున నిపుడు యుద్ధమొనర్పగల సైనికులు ఐదువేలమంది యున్నారు. అందున రెండువేలమంది సుదర్శనునివారలే. ఆవేళ నిశిరాత్రియయ్యెను. దుర్గద్వారము తెఱచుకొని కొన్ని కొన్ని సేనలు లోనఁబ్రవేశించెను, అకస్మాత్తుగా నెటులో జొరఁ

బడిన యాక్రొత్తసైనికులచే దుర్గద్వారరక్షకులు వధింపఁబడిరి. పురము నాల్గువైపుల శత్రుసేనలు నిండిపోయినవి. బురుజులపై గూడ నాక్రమించిరి. పురములోని చండసేనుని సైనికులీ కోలాహలముఁజూచి శత్రువులెట్లులో కోటతలుపులు తెఱచుకొని లోనఁబ్రవేశించిరని యటుచుచు తమతమ శస్త్రాస్త్రముల ధరించి యుద్ధమున కుఱుకుచుండిరి. మంత్రులు సేనాధిపతులు మున్నగువారు పురములోనికిఁ ద్రోసికొనివచ్చు శత్రుసంఘము లలోనికి రానీయకఁ బోరాడసాగిరి.

దుర్గాధిపతియగు చండసేనున కప్పటివఱకు యీవార్త దెలియలేదు. సుందరిరూపమును ధ్యానించుచు పరాకుగా నిదురపట్టక పొరలుచున్న యాతనియొద్ద కొకసేవకుఁడు పరువెత్తుకొనివచ్చి దేవా! శత్రువులు పురములోఁజొరబడిరని మనవిఁజేసెను. ఆమాట వినుటతోడనే క్రోధాశ్చర్యములతో లేచి యశ్వమునెక్కి కరవాలము మొదలగు నాయుధములధరించి శత్రువుల మార్గ్గానేగెను. అతఁడు సన్నద్ధుడై వచ్చుటతోడనే సుదర్శనుఁడు తనసైన్యములతో వానిని మాఱ్కొని యుద్ధముచేయఁదలపడియెను. చండసేనుఁడుగూడ సామాన్యుఁడుగాడు. రణకౌశలమాతనికి చాలగలఁదు. తన్నెదిరించిన సుదర్శనుని పలుబాణముల నొప్పించుచుండెను. ఇంతలో విజయసింహుఁడు తన నాలుగువేల ఆశ్వికవీరులతో సుదర్శనుని ముందునిలిచి చండసేనునిపై వివిధాయుధములఁ బ్రయోగింపసాగెను. చండసేనుని సేనానియగు వీరపాలునితో నశో

కుఁడు ఘోరయుద్ధ మొనర్చుచుండెను. ఆసమయమున నిరు వాగులలోని సైనికులు చాలవఱకు వీరస్వర్గము నొందు చుండిరి. తల లెగిరిపడుచున్నవి. గుఱ్ఱములు(కాళ్ళు) క్రిందఁ బడి పోవుచున్నవి. ఎచ్చటఁజూచినను రక్తప్రవాహములు బాఱు చున్నవి. అశోకుఁడు గుఱిజూచి యావీరపాలుని శిరముపై తన నిశితచంద్రహాసమును విసరెను. ఆదెబ్బతో వానిశిరము తెగి క్రిందఁబడిపోయెను. అశోకుని సైన్యమున సింహనాద ములు చెలరేగెను. హతశేషులగు నాతనిసేనలు అశోకుని శరణుజొచ్చిరి. చండసేనునిమంత్రి తనసేనలఁ బురికొల్పుకొని సుదర్శను నెదుర్కొనియెను. సుదర్శనుఁ డతిబలము మెఱయ నాతనితోఁ బోరుసలుపుచుండెను. ఆ యుద్ధమునఁగూడ చండ సేనునిసేనలకే యపజయముగల్గెను. అశోకుఁడొక్కదాటునఁ వచ్చి యాతనిమంత్రినిబట్టి బంధించెను. చండసేనుఁడును విజయ సింహుఁడును ఒకరినొకరు తీసిపోక పోరుచుండిరి. వారు వివిధా స్త్రపరంపరలచే నొకరినొకరు ముంచుకొనుచు చూచు వారికి వెఱగు గలుగునటుల రణకౌశలము చూపుచుండిరి. కొంతవడికి విజయసింహుఁడు తననిశితకరవాలము గుఱిజూచి చండసేనునిపై విసరెను. ఆతఁడా దెబ్బతప్పించుకొని విజయ సింహునిపై తనచంద్రహాసమును ప్రయోగింపఁ బోవునంతలోన దాటున విజయసింహుఁడాతని యశ్వముపై కుఱికి వాని చేతి కత్తిలాగికొనియెను. ఇంతలో నశోకుఁడు శరవేగమునవచ్చి వానిని బంధించెను. తక్కుంగల చండసేనుని సైనికుల సుగగ

నుఁడు నొప్పించుచుండెను. వా రాసంరంభమునకోపక పలా యితులైరి. ఆసేనలలోని సుదర్శనుని సైనికులపుడే వారికి లోఁబడిరి. తక్కినవారు శరణుజొచ్చిరి. చండసేనుఁడు అశోకునిచేఁబట్టువడియెను. "విజయముగల్గెను" అని సుదర్శ నుని సేనలలో సింహానాదములు మిన్నుముట్టుచుండెను. రణము చల్లారినది. విజయముగల్గినది.

# ఇరువది నాల్గవ ప్రకరణము

## సభ.

సూర్యోదయ మగుసరికి సుదర్శనుఁడు మరల తన సభాభవనమున నిండుకొలువుతీర్చెను. ఆసభాస్థలిమధ్య నొక సువర్ణమణి ఖచితమగు సింహాసనముపై సుదర్శనుఁడు కూరుచుండెను. అతని దక్షిణభాగమున నొక యున్నతాసనముపై కల్యాణపుర యువరాజగు విజయసింహుఁ డాసీనుడై యుండెను. ఆప్రక్క నొక యుచితాసనముపై నశోకుఁడు గూరుచుండి యుండెను. మంత్రులు దండనాథులు మున్నగువారు వారివారి గౌరవోచితాసనముల నలంకరించియుండిరి. నాఁడు సభగాంచఁ బురప్రముఖులు మఱికొందఱుద్యోగులుగూడ సభ నలంకరించిరి. ఆదినము సభఁజూడ గోరివచ్చువారి నెవ్వరాటంకపఱుపక లోనికిఁబోవ నిచ్చుచుండిరి. సభ్యులందఱు చాల సంవత్సరములనుండి యీరాజ్యమున కత్యంతాప్తులగు కల్యాణ నగరాధీశులతో వైరమూని పలుకష్టములకులోనై మరల దైవానుగ్రహమున వారితోఁగలిసి రాజ్యప్రాప్తిఁబడసిన సుదర్శనునిఁజూచి యానందించుచుండిరి. దుష్టరాజుల దుర్బోధనలకు లోనైన తండ్రిచే వెడలనడుపఁబడి దేశములపాలై చాలకాలమునకు మరల విజయుఁడై తమకుఁగనబడిన యశోకునిఁజూచుచు నాతనికి మేలొసంగినదైవమును గొనియాడ సాగిరి! సుదర్శనుఁడు విజయసింహుని యనుమతిని గజపతి

చండసేనులకు వారి గౌరవోన్నతులకు దగు నాసనములొసంగి మన్నించెను. వారతని వినయమునకు లోన సంతసింపు వార లయ్యెను కాము వారియెడఁ జేసిన యవినీతులఁ దలంచి లోలోనఁగుందుచు తలలు వంచుకొనియుండిరి. సభ్యులందఱు అశోకుఁడు మొదలగువారు శత్రువులనుజయించి అరవిందను దప్పించి గజపతినిబట్టుట కెచ్చటెచ్చట నేయే యుపాయములఁ బన్నినదియు నే యే వేషములతో నెచట నెచట మెలంగి నదియు విన కుతూహల మందుచుండిరి. అశోకుఁడు వారి యభిప్రాయముల నెఱింగి లేచి సభకు నమస్కరించి యీవిధ ముగ నుపన్యసించెను.

"ఓ మహాజనులారా, యీశ్వరానుగ్రహమున మరల మాతండ్రిగారి దివ్య శ్రీపాదసన్నిధియందు మాచరిత్రముల నీసభాసముఖమున నుపన్యసించు భాగ్యము గల్గినందుల కెంతయు సంతసించుచున్నాఁడను. మధ్య గ్రహవైపరీత్యమువలన మాకు పరమాప్తులగు కల్యాణపురరాజులతో విరోధము సంభవించు టయు, నాకు దేశాంతరప్రాప్తి గల్గుటయు మీరందఱెఱింగినదే గదా? అవ్వల గజపతి మోహాంధుఁడై మాయరవిందనదుగ తండ్రి యాతని వంచనకులోనై తనయ నాతనికొసంగ నిశ్చ యింప నామె విజయసింహానురక్తయై యీయనిష్టమునకు దుఃఖించుచు ననారోగ్యమునకుఁ బాలయ్యెను. తరువాత నామెకు శ్రీశైలమున దేవీప్రసాదము నారోగ్యము గల్గునని మాతండ్రి సకుటుంబముగా శ్రీశైలమునకుఁ బోవుటయు గజపతి యామె నచ్చటినుండియే అపహరింపఁదలచుటయు

నేనెఱింగి యోగీశునివేషమున నచ్చట నామెను కాపాడు చుంటిని.

ఐనను దైవవైపరీత్యమున మాకనుఁగప్పి యామెను గజపతి యపహరించెను. అంతట వాసంతిక పిచ్చిదానివేసమున నామెననుసరించి కొండవీఁడుచేరి యరవిందను గాంచుచు నచ్చటి విశేషముల నాకెఱింగించుచుండినది. నేను సుమిత్రుఁడనుపేర కల్యాణపురమును జేరితిని. అచ్చటికి గజపతిపంపున నొక్క రుఁడు మమ్ము వెదకిపట్ట ప్రచ్ఛన్నవేషమున వచ్చియుండెను. పిచ్చివేషమున దేశమంతయుఁ దిరుగుచుండిన వాసంతిక కల్యాణనగరముననున్న నన్నుసంబోధించి యాగూఢచారుని విషయ మన్యాపదేశముగాఁదెల్పి పోయినది. నేనాతని పరిశీలింప వానియొద్ద మారూపపటము దొరకినది. నేనదిగ్రహించి వానిని శ్రీవిక్రమసింహ మహారాజునకొప్పించితి. అప్పుడు విజయసింహుని యనుమతి నచటికొక భటునిచే నొక పురుషుఁడు గొనిరాబడెను. వానింజూచి,

సుదర్శనుడు:—నీవెవ్వరు?

పురుషుడు:—గజపతుల యనుచరుఁడను.

సు:—నీపేరేమి?

పు:—నందకుఁడు.

విజ:—కల్యాణనగరమున నాఁడు నీపేరేమని చెప్పితివి?

పు:—మహాప్రభూ వీరసేనుడని

సుద:—ఏల ?

పు:—రాజ రక్షింపుడు, గజపతి అశోకుడుగాని వాసంతికగాని దొరకిన రహస్యముగాఁ బట్టితెమ్మని నన్ను నియమించిరి.

సుద:—ఐన నీపటములు నీయొద్ద నెందులకున్నవి.

పు:— దేవా వారి నెన్నడు నేఁజూచినవాఁడనుగాను, ఆకారణమున నీపటములోనున్న యశోకుడు అరవిందా వాసంతికలగుఱుతించి వారినిబట్టు తలంపుగ వచ్చితిని. సేవకా వృత్తిగదా మన్నింపుఁడు!!

అశోకుఁడు మరల నిట్లుపన్యసించెను.

నాతండ్రి యరవిందను విక్రమసింహుఁడే యపహరించె నని భ్రమసి వానిపై యుద్ధమునకేఁగ గజపతిని సహాయముగా రమ్మని ప్రార్థించెను. గజపతి సరియేయని నమ్మించి మా తండ్రి, సేనలతో పురము దాఁటుటతోడనే అతఁడు చండసే నునిబంపి యీపుర మాక్రమించుకొనియెను గదా.

అంతట విజయసింహుఁడు లేచి యిట్లుపలికెను.

ఈరాజు మాపురమును ముట్టడించియుండ మహానుధా నిధియగు వాసంతిక పిచ్చివేషమునవచ్చి గజపతి కపటకృత్య ములు కొన్ని మాకన్యాపదేశముగాఁ దెల్పిపోయినది. దైవాను గ్రహమున నాదినమే ధర్మయుద్ధమున నీసుదర్శన మహారాజున కును మాకును విరోధములంతరించి సఖ్యము గుదిరినది.

అశోకుఁడు—తరువాత చండసేనుఁడు మాపుర మన్యా యమున స్వాధీనపఱచుకొనినతోడనే వాసంతిక ప్రచ్ఛన్న వేషమున మాపురముంజొచ్చి మాజననియగు సుశీలను

ఇచ్చటనుండి తప్పించి యెచ్చటనో తనయొద్దనుంచుకొని కాపాడుచుండెను. నేనిచ్చటివిశేషములనరయ నొకనాఁటిరాత్రి యీపురప్రాంతారణ్యమున నశ్వారూఢుఁడనై వచ్చుచుండగా వాసంతిక 'రాధ'యను మాఱుపేరుతో నన్నుఁ గలిసికొని యిచ్చటివిశేషము లెఱింగించి నన్ను వెనుకకంపి తానీపురము లోనికిఁబోయి యచ్చటివిశేషములఁ గనుగొనుచు నాకెఱిం గించుచుండినది.

విజయసింహుఁడు:—కల్యాణపుర దేవాలయమున నన్నుఁ జంపవచ్చిన గజపతిచారుని కనుపట్టి యీవాసంతికయే వానిని సంహరించి మన్నుఁ గాపాడినది. మఱియు నామె సాభిప్రాయ వచనములవలననే మఱికొందఱు హంతకు లశోకు నిచేఁ జిక్కిరి. అప్పుడొక పురుషుఁడుఁటకుఁ గొనిరాఁబడియెను. సుదర్శనుఁ డాతనింజూచి

"నీవెవ్వడవు?"

చారుఁడు:—నేను అశోకుఁడుగాని విజయసింహుఁడు గాని చేఁజిక్కినచో సంహరించుటకును, వాసంతిక దొరికినచో చండసేనుని యంతఃపురమునకుఁ జేర్చుటకును నియమింపఁబడిన భీముఁడను చండసేనుని గూఢచారుఁడను.

సుదర్శనుఁడు:—కారణమేమి?

పురుషుఁడు:—విజయసింహుఁడు బ్రదికియుండిన నేవిధ ముచేనైనను తిమ్మజయించి యరవిందను గైకొనక మానఁ డనియు అశోకుఁడున్నచో వాసంతికవర్ధమానములు చండ సేనునకుఁ దక్కవనియు ప్రభువులు చేసిన యుక్తియిది.

మరల నశోకుఁడిట్లు చెప్పసాగెను.

అటుతరువాత నైంద్రజాలికుని వేషముతో కొండవీడు చేరితిని. మంత్రశక్తిచే స్వర్గమునుండి సైన్యముల రప్పించినట్లు మా సైనికుల లోనఁబ్రవేశపెట్టితిమి. ఆభీభత్సప్రదర్శనసమయమున మాయరవిందను వారిరుంతిపురినుండి తప్పించి నేనామె యున్న గదిజేరితిని. పిమ్మటగజపతి మున్నగువారలబంధించి యీదుర్గము స్వాధీన మొనర్చుకుంటిమి. అవ్వాల దుర్భేద్యమగు నీ దుర్గమును సాధించుకొనఁదలఁచి యుందున్న సైనికులు ప్రజలు సగము మంది మావారలేగాన వృథా యుద్ధ మొనర్చిన మా ప్రజలకే నష్టము గల్గునని యూహించి వాసంతిక 'సుందరి' రూపమున నీపురముం జొచ్చినది. దైవసాహాయ్యమున విజయము గల్గినది. ఇది మా చరిత్ర మని యాతడూరకుండెను.

సుదర్శను డపుడు గజపతివంకఁ జూచి "ధర్మప్రభువుగా నుండదగువాఁడవును సార్వభౌముండవునగు నీవు రాజ్యలోభ కామాంధకారములచే మమ్ము వంచించి మాలో మాకు విరోధములఁ గల్పించి మారాజ్య మపహరించితివి. నేను నీవంచనలలోఁబడి చెడితిని. కల్యాణ నగరాధీశులతో వృథా వైరము గొంటిని. నీ దురాశవలనను నిరంకుశత్వము వలనను అబలలను చెఱపట్టితివి. నిరపరాధులు, దేశోపకారులు నగు వీరిని సమయింపనెంచితివి. ధర్మపక్షపాతియగు దైవమొకడు పైనుండి యన్నియుఁ జూచుచుండుటవలన నీ పాపవర్తనలకుఁ దగు ఫలమొసంగి సజ్జనుల నుద్ధరించినాడు. ధర్మమునకు జయముగల్గినది. ఇప్పుడు నీకేమి ప్రతీకార మొనర్పవలయునో

సూక్ష్మబుద్ధియు వీరాధివీరుండును, అగు విజయసింహుఁడు వచించుఁగాక.

అప్పుడు విజయసింహుఁడు లేచి యీవిధముగ నుపన్యసించెను. "చంపదగినయట్టి శత్రువు తనచేతఁ జిక్కినను వాని కేమియు నెగ్గొనర్పక శక్తికొలఁది యుపకారమొనర్చి పంపుటయే సజ్జనులలక్షణము. అట్లు జేయుటయే వారికిఁ బ్రతీకారము. చేతజిక్కినవారిని దండింపఁబూనుట వీరులయొక్క లక్షణముగాదు. అట్లు చేసినవారిపై దైవమున కాగ్రహము గల్గును. అదియునుంగాక యీతఁడు రాజాధిరాజు. మనకెల్ల రకు గౌరవనీయుడు. కాలవైపరీత్యమున నతని కిట్టి దుర్బుద్ధులు గల్గినవి. తగుఫలమును దైవమొసంగినాఁడు. రాజ్యలోభమున నెంతటివారైనను ఒకొక్కప్పుడు కొన్ని ప్రమాదములకు పాల్పడుదురు. అట్టియెడ సచ్చరిత్రులగు వారు వారిని సామ దానభేదదండోపాయముల లోఁబఱచుకొని తగుబుద్ధి గఱపి మరల సత్ప్రవర్తనలోనికిఁ ద్రిప్పవలయును. అంతియెకాని వారి నంతటితో నడుగునఁ ద్రొక్కరాదు. ఈతఁడు సత్కులజాతుఁడగు ప్రభువరుఁడగుటవలన ముందుముందు కష్టసుఖము లొంటఁబట్టి మంచిచెడ్డలరసి ప్రజానురంజకముగా రాజ్యపాలన మొనర్పఁగలఁడని తలంచెద" అని యాతఁ డూరకుండెను.

సభ్యులందఱు విజయసింహుని శాంతమునకు నయమునకు సంతసించి యాతనిఁ గీర్తించుచు, కరతాళధ్వనులఁ జేసిరి. గజపతి యాతని సౌహార్దమున కచ్చెరువందుచు నిట్టి వానియెడ తా నొనర్చిన యవినీతకార్యములం దలఁచి తనలోఁ దాను

చింతించుచుండెను. విజయసింహుఁడు గజపతింజూచి "రాజా, దుష్కాలవైపరీత్యమునను దుర్బుద్ధులవలనను బండ్లోడలును, ఓడలు బండ్లును గావచ్చును. ఇందుకై విచారింపవలదు. ఇఁక నైన సన్మార్గగామివై ప్రజానురంజకుఁడవై దుర్విషయములు దలపెట్టక సుఖముగా రాజ్యపరిపాలన మొనర్చుకొనుము.

గజపతి కాతని ప్రబోధవాక్యముల వలన జ్ఞానోదయ మైనది. అతఁ డీవిధముగాఁ బల్కెను. "విజయసింహా! దుర్బుద్ధికై మీయెడల నెన్నని యకార్యము లొనర్చితిని. తగుఫలమందితిని. ఇప్పుడు నీ సౌహార్దబుద్ధి కెంతయు నబ్బుర మందితిని. ఇదిమొదలు నీ యుపదేశమే మార్గోపదేశముగాఁ గొని సత్పథమున నడచుకొనియెదను. రాజ్యము, ధనము, అధి కారము మాత్రముగల వాడెన్నటికిని సార్వభౌముఁడు గాఁజా లఁడు. బుద్ధి, శౌర్యము, దయ, సౌశీల్యము వీనియం దెవ్వఁ డధికుఁడో వాఁడే రాజరాజు. అట్టివాఁడవు నీవుగాని మేమెన్న టికిఁ గాఁజాలము. కాఁబట్టి సత్యమువచించు నిన్నీ సభాభవన మున నభినందించుచున్నాఁడను." అని యూతడూరకుండెను. గజపతి బుద్ధిఁయంతయు మంచిమార్గమునఁ బ్రవేశించినందులకు సభవారంతయు నాశ్చర్యసంతోషములతోఁ గరతాళము లొనర్చిరి. సుదర్శనుని కొలువు సంతోషప్రదముగా ముగింపఁ బడినది.